# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

"డబ్బుకు యజమాని" అన్న బేతాళ కథలోని నీతిని చాలామంది గ్రహించరు. కాని అది పాత నీతే. "అమర వాణి" శీర్షికలో ఆ నీతి గల శ్లోకాన్ని కూడా పాఠకులు చదివారు. అయినా అది అందరూ జ్ఞాపకం ఉంచుకో దగిన నీతి.

"చిన్నది యుక్తి" అన్న కథలో మూఢవిశ్వాసాలు సమాజాన్ని ఎలా శాసించేదీ తెలుస్తుంది. ఆధునిక యుగంలో అలాటి మూఢవిశ్వాసాలు ప్రజలను శాసించటం తగదు.

సంపుటి 55 నవంబర్ '74 సంచిక 5





# మిత్రభేదం

## 17

నక్క సింహం వద్దకు వెళ్ళి, "మహా ప్రభూ, అరణ్యం అంతా గాలించాం. ఎక్కడా ఒక్క జంతువైనా కనిపించలేదు. మాకు శోష వచ్చేసింది. ఒక్క అడుగు కదలలేం. మీకు కూడా ఆహారం ఎంతైనా అవసరం. మీరు ఒప్పుకుంటే వికటాన్ని చంపి, మంచి మాంసం సంపాదించ వచ్చు!" అన్నది.

ఈ మాటలు విని సింహం మండిపడి, "ఛీ, వెధవా! అలాటి పాపిష్ఠి మాట మరొకసారి అన్నావో నిన్ను తక్షణం చంపేస్తాను. నేను వికటానికి అభయం ఇచ్చి ఉన్నాను. అలాటప్పుడు దాన్ని ఎలా చంపగలను? అభయదానం గోదానం కన్నా, భూదానం కన్నా, అన్న దానం కన్నా ఎక్కువైనదని చెబుతారు," అన్నది.

"అభయం ఇచ్చిన మీరే ఒంటెను చంపితే, అది పాపమే అవుతుంది. కాని అదే వచ్చి మీ కాళ్ళ మీద పడి, తనను చంపమని ప్రార్థించినట్టయితే మీరు దాన్ని చంపవచ్చు. ఇందుకు కూడా ఏలివారు ఒప్పుకోక పోతే, మా మిగిలిన ముగ్గురిలో ఎవరినన్నా తినెయ్యండి. ఎందుకంటే మీకు ఆహారం ఎంతైనా అవసరం. మీరే ఆకలితో చావటం జరిగితే, మేమంతా మీ చితి మీద కాలిపోవలసిన వాళ్ళమే గద!" అన్నది నక్క.

"సరే, నీ యిష్టం!" అన్నది సింహం.

నక్క మిగిలిన ముగ్గురి వద్దకూ తిరిగి వచ్చి, "మన రాజుకు ప్రాణం నిలిచేటట్టు లేదు. ఆయన ఆకలికి చావకుండా మనం మన శరీరాలను అర్పించాలి," అన్నది.

అట్ట చివరి బొమ్మ

నాలుగూ కలిసి సింహం వద్దకు వెళ్ళి, నమస్కారం చేసి, కన్నీరు కార్చుతూ ఉండిపోయాయి.



తన వద్దకు తిరిగి వచ్చిన భృత్యులను చూసి ఆ సింహం, "ఆహారంగా జంతు వేదైనా దొరికిందా?" అని అడిగింది.

"మహారాజా, అరణ్యమంతా మరొకసారి గాలించాం. ఎక్కడా ఒక్క జంతువు కనిపించలేదు. అందుచేత, నన్ను అనుగ్రహించి ఆహారంగా తీసుకుని, విలువైన మీ ప్రాణాలు కాపాడుకోండి. అందువల్ల నాకు ఇహమూ, పరమూ కూడా ఉంటాయి," అన్నది కాకి.

ఈ మాట విని నక్క, "నువు అల్ప ప్రాణివి. నిన్ను తిని మన యజమానికి ప్రాణాలు నిలవటం అసంభవం. పైగా నిన్ను తింటే పాపమని శాస్త్రాలు చెబుతున్నాయి. కాకి మాంసమూ, కుక్క మాంసమూ ఆరోగ్యాన్ని పాడుచేస్తాయట. అయితే నీ స్వామిభక్తి చాలా గొప్పది. నీ కీర్తి మూడు లోకాలా వ్యాపిస్తుంది. అందుచేత పక్కకు జరుగు. నేను కూడా ప్రభువుకు విజ్ఞాపన చేసుకోవాలి," అని, సింహంతో తనను తిని ప్రాణాలు నిలుపుకోమని విన్నవించు కున్నది.

నక్క ఇలా అనే సరికి చిరుతపులి, తాను కూడా కుట్రలో చేరినదే కనక, "ఓ నక్కా, ఎంత చక్కగా చెప్పావు! నువు కూడా అల్ప ప్రాణివే. అదీగాక నువు కూడా గోళ్ళున్న జంతువే గనక; సింహం కులానికి చెందిన మృగానివే అవుతావు. నిన్ను సింహం తినరాదు," అన్నది. తరవాత అది సింహంతో, "మహారాజా, మీ ప్రాణాలు నిలుపుకునేటందుకు నన్ను తిని నాకు ఈ లోకంలో శాశ్వతకీర్తీ, పరలోకంలో - శాశ్వత సుఖమూ కలిగించండి! అంతకన్న నేను కోరేదేమీ లేదు," అన్నది.

మిగిలిన జంతువులన్నీ ఇలా అనటం విని ఒంటె, "ఈ ముగ్గురూ ఎంతో ఉదారంగా మాట్లాడారు. కాని సింహం వీటిలో

ఎవరినీ చంపలేదు. అందుచేత నేను కూడా నన్ను తినమని వేడుకుంటాను. ఈ మూడూ నా ప్రాణానికి అడ్డుపడ తాయి,'' అనుకున్నది.

ఒంటె ఇలా అనుకుని, ''ఓ చిరుత పులీ! నువు చాలా గొప్పగా మాట్లాడావు. అయితే నువు కూడా మరి గోళ్ళున్న జంతువువేగద. మన యజమాని నిన్ను తినటం ఎలా పొసగుతుంది? నువు పక్కకు తొలగు. నేను కూడా విజ్ఞాపన చేసుకోవాలి,'' అని తాను కూడా సింహం ముందుకు వచ్చి, నమస్కరించి, ''మహా ప్రభూ, ఈ ముగ్గురూ తమకు ఆహారంగా ఫనికిరారు. అందుచేత నన్ను తిని మీ అమూల్యమైన ప్రాణాలు రక్షించుకోండి. యజమాని కోసం ప్రాణాలు అర్పించిన వాళ్ళకు వచ్చే స్వర్గ సుఖం యజ్ఞాల వల్లా, యోగం వల్లా కూడా రాదంటారు,'' అన్నది.

ఒంటె ఇలా అనగానే సింహం సైగ చేసింది. వెంటనే నక్కా, చిరుతపులీ దానిమీద పడి, క్షణంలో చీల్చి చంపేశాయి. ఆ ఒంటెను తిని సింహమూ, దాని ముగ్గురు భృత్యులూ తమ ప్రాణాలు పోకుండా కాపాడుకున్నాయి.

సంజీవకం దమనకానికి ఈ కథ చెప్పి, ''అబ్బి, ఎవరో కుట్ర వెధవలు నా మీద పింగళకం మనస్సు విరిచారని నా అనుమానం. మంచి మంత్రులు గల చెడ్డరాజు కన్న చెడ్డ మంత్రులు గల మంచి రాజు మరీ అన్యాయం. గద్దలు మంత్రులుగా గల హంస కన్న, హంసలు మంత్రులుగా గల గద్ద మేలు. ఎవరో దుర్మార్గులు నాకూ, పింగళకానికీ మధ్య భేదం కలిగించారు. ఇప్పుడు నేను ఏం చెయ్యాలన్నది సమస్య. పోరాడటం తప్ప చేసేది ఏమీ కనబడదు. మంచి మాటలూ, కానుకలూ, కుట్రలూ ఇక పని చెయ్యవు. సామదానభేదాలు లాభం లేదు గనక యుద్ధం తప్పదు. అందులో ఓడానా, స్వర్గానికి పోతాను. గెలిచానా, హాయిగా జీవిస్తాను,'' అన్నది.





## 5

[దానశీలమహారాజు తన ముగ్గురు కుమార్తెలనూ, భూగృహంలో మూడేళ్ళపాటు రహస్యంగా వుంచి కాపాడాడు. ఇంకొక్క ఇరవైనాలుగ్గంటల్లో ప్రమాదం తొలగిపోతుందనగా, తొందరపడి కుమార్తెలను, భూగృహం నుంచి బయటికి తీసుకువచ్చాడు. వెంటనే మూడు గద్దలు వచ్చి పిల్లల్ని తన్నుకుపోయినై. రాజూ, రాణీ దుఃఖపడసాగారు. తరవాత—]

కొంతసేపటికి దానశీల మహారాజు దుఃఖాన్నుంచి తేరుకోగలిగాడు. రాణీ మాత్రం యీ కఠోరవార్త విని, ఆగని మఃఖావేశంలో కొయ్యబారి పోయింది. పిల్లలతోబాటు రాణీ కూడా తనకు దక్కకుండా పోతుందేమోనని రాజు చాలా భయపడ్డాడు.

"మూడేండ్లూ మొండి కేసినట్టుగానే, ఈ ఒక్కరోజు కూడా పిల్లల్ని ఎలాగో సమాధాన పరచగలిగితే, ఈ ముప్పురాక పోయివుండును గదా? పాపిష్ఠివాడిని, అపాటి నిబ్బరం లేక, చూస్తూ చూస్తూ చేతులార నా చిట్టి తల్లుల్ని పక్షులకు పప్పగించుకొన్నాను. నా రాణీ కూడా నాకు దక్కదా?" అంటూ రాజు మొత్తుకొన్నాడు. అక్కడ ఒకళ్ళ ముఖానా కత్తివాటు వేస్తే నెత్తురుచుక్క లేదు. గంటలు గడిచినా రాణీకి తిరిగి స్పృహరాక



పోయేసరికి, ఆమె బ్రతికే ఎత్తులేదని అందరూ నిరాశచెందారు.

మరికొద్ది సేపటికల్లా ఆస్థానవైద్యుడు అక్కడికి వచ్చాడు. రకరకాల ఓషధులు యిచ్చి, ఎలాగైతే నేం చివరకు రాణీకి స్పృహ తెప్పించాడు. తిరిగి అందరి ముఖాలలో క్షణమాత్రం ఆనందం తొణికిసలాడింది. కాని ఆ సంతోషం అట్టే సేపు నిలవలేదు. రాణీకి స్పృహ అయితే వచ్చింది కాని, ఈసారి తగిలిన దెబ్బతో, ఆమె మతి పూర్తిగా చలించిపోయింది-

''ఏరీ, నా చిట్టి తల్లులు? ఎక్కడ దాచారో చెప్పండి?'' అంటూ పిచ్చి పిచ్చిగా మాట్లాడసాగింది.

''ఇంకా నీ దగ్గిర నేను మర్మం పెడతానా? నా మాట నమ్ము. పిల్లల్ని ఎక్కడా దాచలేదు. గద్దలు తన్నుకుపోయినై. నా మాట నమ్మకం లేకపోతే, అదుగో, సేవకులందరూ వున్నారు. వాళ్ళని అడిగి చూడు,'' అని దీనంగా అన్నాడు రాజు.

కాని, ఏమి చెప్పినా రాణీ అర్థం చేసికోగల స్థితిలో లేదు. ''మీరంతా ఒకటే. మీతో నాకేం పని? నా పిల్లల్ని వెతికి నేనే తెచ్చుకుంటాను. నన్ను పోనివ్వండి!'' అంటూ ఆమె మంచం మీది నుంచి లేచిపోబోయింది.

గోరుచుట్టు పైన రోకటి పోటన్నట్టు, ఈ క్రొత్త అవాంతరం చూచి రాజుకి ఏమీ పాలు పోయింది కాదు. ''ఆమె మనస్సు కుదుట బరచలేరా?'' అన్నట్టు ఎంతో జాలిగొలిపేటట్టు చూశాడు ఆస్థాన వైద్యుడి వంక.

ఆస్థాన వైద్యుడు బాగా ఆలోచించి వెంటనే ఒక ఔషధం యిచ్చాడు. ఆ మోతాదుతో రాణీ నోరు మెదపటం మానివేసి, ఒక శిలా ప్రతిమలా వుండిపోయింది.

తరవాత ఆస్థాన వైద్యుడు రాజుని ప్రక్కకు పిలిచి, ''రాజా! ఇప్పుడు అమ్మాజీవారికి శరీరబాధ ఏమీ లేదు.

చిక్కు యావత్తూ మానసిక సంబంధ మైనదే. ఇందుకుగాను మనం చేయ వలసినదల్లా, చిరంజీవులను పట్టి తెచ్చి, ఆమె ఎదట పెట్టడం. ఎంత త్వరలో మనం ఈ పని చేయగలిగితే, అంత చప్పున రాణీ వారు తేరుకొంటారు. కనుక, ఇతర చింతలు మాని, ముందు ఎలా ఐనా మన ముద్దు బిడ్డలను వెతికి పట్టి, అమ్మాజీవారి ఎదట పెట్టటానికి ప్రయత్నించాలి. ఈ ఒక్క పనిలో తాము చేయగలిగిన దంతా చేయించండి. రాణీ వారి ఆరోగ్యాన్ని గురించి నేను చూచు కొంటాను,'' అని ధైర్యం చెప్పాడు.

''అలాగే చేదాం. ఇందును గురించి, యిప్పుడే చాటింపు వేయిస్తా. మీరు మాత్రం రాణీని కనిపెట్టి వుండండి,'' అని మళ్ళీ వేడుకొన్నాడు రాజు.

ఆ ప్రకారం రాజు తన యావత్తు సిబ్బందినీ, మరి ఒకసారి దేశం నలు మూలలకూ పంపించాడు. బిడ్డల జాడ తెలుసుకు వచ్చిన వారికి తన రాజ్యం యిస్తానని కూడా చాటింపించాడు.

* * *

వారాలూ, నెలలూ గడిచినై. కాని, పిల్లల్ని వెతకబోయిన సిబ్బందిలో ఒక్కరూ తిరిగి రాలేదు. చాటింపు విని ఒక్క సమర్థుడు కూడా ముందుకు



రాలేదు. ఇదంతా చూడగా రాజుకీ మతి చలించేలాగ కనుపించింది. అక్కడ చూడబోతే రాణీ పరిస్థితిలో కూడా మార్పు ఏమీ కానరాలేదు.

ఒకనాటి తెల్లవారగట్ల, రాజు మూడో అంతస్థుపైన పచారు చేస్తున్నాడు. ఆ మసక వెలుగులో దూరాన, మూడు స్వరూపాలు తన మహలు వైపు వస్తుం డటం కనిపించింది. వాళ్ళు ముగ్గురు పిల్లలు. సమానమైన ఎత్తూ, లావూ కలిగి, అల్లంత దూరాన వున్నా ముగ్గురూ ఒకే అచ్చులో పోసినట్టున్నారు.

వాళ్ళు తన కుమార్తెలే అయి వుంటా రనుకుని రాజు ఎంతో ఆశతో గబగబ దిగి



వచ్చి, వాళ్ళ వైపు పరుగెత్తాడు. తీరా దగ్గరకు వెళ్ళేసరికి, ఆ ముగ్గురూ మగ పిల్లలని తేలింది. అయినా వాళ్ళ ముగ్గురిలో వుండే ఒకే విధమైన పోలిక చూచి రాజుకి మనసులో ఒక చిత్రమైన అనుమానం కలిగింది.

"ఒకవేళ నా కుమార్తెలే, ఆ దుష్ట గ్రహాల మాయవల్ల, ఇలా మగపిల్లలుగా మారిపోయి వుండరు గద!" అనుకుని ఆయన కదలామెదలక నిలబడి, వాళ్ళ వంక పరీక్షగా చూడసాగాడు.

ఆశతో, నిరాశతో క్షణ క్షణానికి రకరకాలుగా మారుతున్న రాజు ముఖలక్షణాలను గమనిస్తూ, ఆ ముగ్గురు పిల్లలలో ఒకడు ఆయన కేసి విస్తుపోయి చూడసాగాడు. చివరికి రాజు వుండబట్టలేక, "మీ రెవరు, నాయనా? మీదేవూరు? ఇలా ఎందుకు వచ్చారు?" అని వేగిరపాటుతో ప్రశ్నల వెంబడి ప్రశ్నలు అడిగాడు.

తమని ప్రశ్నిస్తున్నది రాజై వుంటాడని, ఆ కుర్రవాళ్ళు గ్రహించలేకపోయారు. ఎందువల్ల నంటే, ఒంటికి సరియైన దుస్తులా లేవు. పైగా ఆయన ముఖంలో కళాకాంతీ లేదు. కావటానికి రాజే అయినా, ఆ నిమిషాన రాజు ఒక సామాన్య మానవుని లాగానే వున్నాడు. ఎవరైనప్పటికీ, అడిగిన ప్రశ్నకి జవాబు చెప్పాలి కదా! అందుకని కుర్రవాళ్ళు, "ఇక్కడికి దక్షిణాన వుండే భద్రపురి మా ఊరు. మీ రాజావారి చాటింపు విని యిక్కడికి వచ్చాం," అన్నారు.

"ఓహో! అలాగనా. అయితే పదండి. నాకూ అక్కడ పని వుంది. మిమ్మల్ని రాజుగారి దగ్గరకు తీసుకు వెళ్ళగలను," అంటూ రాజు వాళ్ళని వెంట బెట్టుకుని మహలు చేరుకున్నాడు.

తర్వాత ఆయన వాళ్ళ ముగ్గురిని కుర్చీలలో కూర్చోబెట్టి, తాను తన సింహాసనం అలంకరించాడు. "అబ్బాయిలూ! మీకు రాజుతో పని వున్నదన్నారు కదూ?"

అంటూ ప్రక్క నున్న కిరీటాన్ని తలపైన ధరించాడు.

ఇది చూచి ఆ కుర్రవాళ్ళలో ఒకతను, "ఆc! తమరేనా రాజా వారు?" అని ఆశ్చర్యపోయి లేచి నమస్కరించాడు. వెంటనే మిగతా యిద్దరు కూడా లేచి నిలబడి నమస్కరించారు.

"ఔను, నాయనా! మీరు చూడ వచ్చిన ఆ దురదృష్టపు రాజును, నేనే! నన్ను గుర్తించలేక పోవటంలో మీ తప్పు లేదు. నా పరిస్థితి అలా వున్నది. దానికేం గాని, మీ చరిత్ర చెప్పండి ముందు," అని ఆత్రంతో అడిగాడు రాజు.

రాజు అడిగిన దానికి, మొదటగా ఆయనకు నమస్కరించిన కుర్రవాడు, "మహారాజా! మేము భద్రపురిలో నివసించే ఒక పేదరాలి కుమాళ్ళం. నా పేరు వెలుగు; ఇతని పేరు చీకటి; అతని పేరు సంధ్య!" అని తక్కిన ఇద్దరి వైపు చూపాడు.

రాజుకి ఆశ్చర్యంతోపాటు నవ్వు వచ్చింది. ఆయన, "ఏమిటీ, మీ పేర్లు సంధ్యా, చీకటీ, వెలుగూనా? చిత్రంగా వున్నయ్యే! ఇటువంటి పేర్లు పెట్టుకోడానికి ఏమైనా కారణముందా?" అని అడిగాడు.

అందుకు వెలుగు యిలా చెప్పాడు: "అయ్యా, మేము ముగ్గురం మా తల్లి కడుపున, ఒకే రోజున కొద్ది గంటల తేడాలో పుట్టాము. ఇతను సంధ్యవేళ





పుట్టాడు. ఆ తరవాత అతను అర్ధరాత్రి వేళ పుట్టాడు. ఆ తరవాత నేను సూర్యోదయమప్పుడు పుట్టాను. ముగ్గరం ఒకే అచ్చులో పోసినట్లు వుండటం చూచి, మా తల్లి మాకు ఏమి పేర్లు పెట్టితే బాగుండునా అని ఎంతో ఆలోచించిందట. చివరికి మేము పుట్టిన వేళకు తగినట్టుగా, మా పేర్లు యిలా సంధ్య అనీ, చీకటి అనీ, వెలుగు అనీ పెట్టిందట.''

''భేష్, బాగా వుంది! అయితే మీరు ముగ్గురూ కవలలన్నమాట. ఎంత చిత్రం! నా చిట్టి తల్లులూ కవలలే. కవలల్ని పట్టటానికి, కవలలు వెతుకరావటం చూడగా, దైవ నిర్ణయంగా వున్నదే.'' అంటూ రాజు ఆ కుర్రవాళ్ళని తన దగ్గిర కూచో బెట్టుకుని, ''అయితే, మీరు యిలా బయలుదేరినట్లు, మీ అమ్మగారికి తెలుసునా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు వెలుగు పేరు గల కుర్రవాడు యిలా జవాబిచ్చాడు: ''తెలియకేం? మా తల్లికి చెప్పకుండా మేము ఏపనీ చెయ్యము. ఆమె యిష్టపడిన మీదటే, మేము యిలా బయలుదేరి వచ్చాము. పోతే, ఇంటి వద్ద వృద్ధురాలైన మా తల్లిని వదిలి మేము ముగ్గురమూ వచ్చేస్తే ఎలాగ అని మీరడగవచ్చు. దానికీ కారణం వున్నది. మేము పుట్టిన వేళా విశేషమేమో కానీ, సంధ్యవేళ పుట్టినతను ఎక్కువ వెలుగుగానీ, చీకటిగానీ చూడలేడు. సూర్యాస్తమయం అయిన దగ్గరనుంచీ, దాదాపు బాగా చీకటి పడేటంత వరకు మాత్రమే యితను నిర్భయంగా సంచరించగలడు. ఇతని చూపు అంతవరకే. ఈలోపునగానీ, ఆ పైనగానీ అతను పూర్తిగా అంధుడి క్రిందనే లెక్క.

''ఇక, చీకటి అన్న పేరుగల అతని విషయం వినండి. ఇతను వెలుతురనేది ఏ మాత్రమూ సహించలేడు. అందువల్ల చీకటి రాత్రులు ఇతనికి అనుకూలం. చివరికి నా సంగతి; నాకు పూర్తి వెలుగు

కావాలి. బాగా తెల్లవారితేగాని బయటికి రాలేను. తిరిగి సూర్యాస్తమయం అయే వేళకే ఇల్లు చేరుకోవాలి. మా యీ వింత స్వభావాలను ఆధారం చేసికొనే యిప్పుడు మేము ముగ్గురం యిక్కడికి రావటానికి సాహసించ గలిగాము. తరవాత— రాకొమార్తెలను వెతికి తీసుకు రావటం అనేది, అంత తేలికైన పని కాదని మాకు తెలుసు. ఈ పని సాధించటం మా ముగ్గురిలో, ఏ ఒక్కరి వల్లా కాదనీ తెలుసు. ఐతే, రోజు ఇరవైనాలుగ్గంటల లోనూ, మూడ్రొద్దులా ముగ్గురమూ ఎటు వంటి పనినైనా చక్కబెట్టటానికి సమర్థుల మయి వుండటం చేత, ఇప్పుడు యీ అన్వేషణ కార్యములో పాల్గొనాలను కుంటున్నాము. ముగ్గురమూ కష్టపడి రోజూ ఒక్కొక వేళలో, ఒక్కొకళ్ళము మా పనులు మేము చేసికొన్నట్టయితే, మాకు అసాధ్యమనేది వుండనే వుండదు. ఏ కార్యమైనా తప్పక జయించుకు రాగలము. ఈ కారణం చేతనే మా తల్లిని ఒంటిపాటుగా వదలి, ఇప్పుడు ముగ్గు రమూ కలిసి బయల్దేర వలసి వచ్చింది.''

అందుకు రాజు, ''నీవు చెప్పినది చాలా బాగుంది. మీ తల్లిని గురించి మీకు ఏ విధమైన చింతా అక్కరలేదు. ఇప్పుడే ఆమెను రప్పించుతాను. మాతో పాటు మహలులో వుంటారు,'' అన్నాడు.

''మా కదే పదివేలు,'' అన్నారు కుర్రవాళ్ళు ముగ్గురూ ఏక కంఠంతో.



ఉన్నపాటుగా రాజు తన సేవకుల్ని భద్రపురికి పంపి, ఆ కుర్రవాళ్ళ తల్లిని రప్పించాడు. రాజు చూపిన ఈ ఔదార్యానికి, ఆమె కూడా ఎంతో మురిసిపోయింది.

రాజు ఆ వృద్ధురాలితో, "అమ్మా! కుర్రవాళ్ళ వల్ల మీ వంశచరిత్ర తెలుసుకున్నాను. ఇలాటి ధైర్య సాహసాలుగల కవల బిడ్డలను కన్న నీవు ధన్యురాలివి, తల్లీ!" అంటూ ఆమె పట్ల తనకు గల భక్తి విశ్వాసాలను వెల్లడించాడు.

ఆమె అనుమతి పొంది, రాజు కుర్రవాళ్ళ పేర్లు కొద్దిగా మార్చి, సంధ్యాకుమారుడు, నిశీధుడు, ఉదయనుడు అని పిలవజొచ్చాడు. కుర్రవాళ్ళూ, తల్లీ కూడా యిందుకు ఎంతో సంతోషించారు.

మరునాడే, కుర్రవాళ్ళకి ఒకటోరకమైన కత్తులూ, కటార్లూ యిచ్చి, వాళ్ళకు తలకొక గుర్రాన్నీ ఏర్పాటు చేయటానికని, దానశీలమహారాజు వాళ్ళను అశ్వశాలకు తీసుకువెళ్ళాడు.

ఆ కుర్రవాళ్ళ పేర్లకు తగినట్టు రాజు, ఉదయనుడికి సూర్యకాంతిలా ధగధగ మెరిసే తెల్లటి గుర్రాన్నీ, నిశీధుడికి నిగనిగలాడే నల్లటి గుర్రాన్నీ, సంధ్యాకుమారుడికి ఎర్రని గుర్రాన్నీ యిచ్చాడు.

ఒక సుముహూర్తాన తెల్లగుర్రం పైన ఉదయనుడూ, నల్లగుర్రం పైన నిశీధుడూ, ఎర్రగుర్రం పైన సంధ్యాకుమారుడూ—సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలను వెతుక్కుంటూ బయలుదేరారు.

వాళ్ళు బయలుదేరే ముందు రాజు, మూడు నల్ల జెండాలు తెచ్చి, మూడు గుర్రాలకూ ముందు భాగాన కట్టాడు. "నా చిట్టి తల్లుల్ని తీసుకుని ఏ క్షణాన మీరు తిరిగి వస్తారో, ఆ క్షణాన వీటిని పీకి పారెయ్యండేం, మరిచిపోక," అని హెచ్చరిక చేశాడు.

ఆ తరవాత తమ తల్లీ, రాజూ మనసారా దీవించగా, కుర్రవాళ్ళు ముగ్గురూ వాయువేగంతో సాగిపోయారు.

— (ఇంకావుంది)





# డబ్బుకు యజమాని

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకొని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాలుడు, "రాజా, నీ శ్రమ ఫలించి, నీ కెవరైనా వరం ఇస్తామన్నట్టయితే, అర్థంలేని వరం ఏ పరిస్థితులలోనూ కోరకు. అలా చేసి నట్టయితే వసుగుప్తుడి లాగా నువు చాలా నష్టపడతావు. శ్రమతెలియకుండా వుండ గలందులకు, నీకు వసుగుప్తుడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఉద్దానపురంలో వసుగుప్తుడు అనే కోటీశ్వరుడు ఉండేవాడు. ఆయన ఇంట ఎన్నో ఇనప్పెట్టెలుండేవి. అన్నిటి నిండా బంగారం ఉండేది. లక్ష్మీదేవిని తన ఇంట కట్టేసుకున్నాడని లోకులు



## బేతాళ కథలు




ఆయనను గురించి అనుకునే వాళ్ళు. ఆయన కొడుకు ఎదిగి వచ్చాడు. అతను కూడా తండ్రితో బాటు వ్యాపారంలో పాల్గొంటూ ఉండేవాడు.

వసుగుప్తుడు డబ్బు సంపాదించటం తప్ప జీవితంలో ఇంకొక ఆశయం ఎరగడు. ఆయనకు చిల్లిగవ్వ అయినా వృథాగా ఖర్చు పెట్టడం అంటే ఎంత మాత్రమూ ఇష్టం ఉండేదికాదు. ప్రతి చిన్న విషయంలోనూ అయన పొదుపు అన్నది పవిత్రంగా చూసేవాడు. వసుగుప్తుడూ, ఆయన భార్యా, కొడుకూ, కోడలూ—ఈ నలుగురే వసుగుప్తుడి కుటుంబం. కాని వారు తినే తిండి చాలా సాదాగా ఉండేది. భోజనం విషయంలో కూడా వసుగుప్తుడు వీలయినంత పొదుపు పాటించేవాడు. ఆడంబరంగా తినట మంటే అయనకు చాలా కోపం.

ఇలా ఉండగా వసుగుప్తుడికి మనమడు పుట్టాడు. మనమడి బారసాల వైభవంగా జరిపి, ఎంత ఖర్చయినాసరే, బ్రహ్మాండమైన విందులూ, వేడుకలూ జరిపింతామని వసుగుప్తుడి భార్య అన్నది. ఈ మాట విని వసుగుప్తుడు అమితంగా చిరాకుపడ్డాడు.

"విందులూ, వేడుకలూ దేనికి జరపాలి? వాటికింద అయే ఖర్చు నిరుపయోగం గదా? మనవడు పుట్టాడంటే, నలుగురికి అయిదుగురం అయాం. దానితో బాటు ఖర్చు పెరుగుతున్నది. దానితో రాబడికూడా పెరగాలి. ఉన్న వ్యాపారం అబ్బాయి చూడగలడు. నేను ఎక్కైనా వెళ్ళి, అదనపు రాబడి తెస్తాను," అన్నాడు వసుగుప్తుడు.

ఆయనకు తన కోడలు చాలా తెలివిగల దని తెలుసు. అందుచేత ఆయన ఆమెతో, "నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు.

ఆమె తన మామగారితో, "ఎక్కైనా వెళ్ళి అధికంగా డబ్బు సంపాదించుకు వస్తానంటే, అనుకున్నది మీరు చేసి తీరు

తారు. మీకు సలహా ఇచ్చే తాహతు నాకు లేదు. మీరు దారి ప్రయాణానికి తీసుకుపోయే ఆహారం మటుకు నన్ను తయారు చేసి ఇయ్యనియ్యండి." అన్నది.

తన కోడలు తన ప్రయాణానికి ఆమోదించినందుకు సంతోషించి వసుగుప్తుడు ఆమె తనకు ఆహారం కట్టి ఇయ్యటానికి ఒప్పుకున్నాడు. ఆమె ఆయన తినటానికి కుంకుమపువ్వు మొదలైన ఖరీదైన దినుసులతో తయారుచేసి, నేతిలో వేయించిన చిత్రాన్నమూ, తాగటానికి ఒక చిన్న తిత్తిలో చక్కెర పానకమూ తయారు చేసి ఇచ్చింది.



కోడలు ఇచ్చిన ఆహారం తీసుకుని వసుగుప్తుడు బయలు దేరాడు. ప్రయాణం అలవాటు లేని కారణంచేత, కొద్ది మైళ్ళు నడిచే సరికే ఆయన కాళ్ళు బొబ్బలెక్కాయి, ఆయాసం వచ్చింది.

వసుగుప్తుడు ఇంక ఒక్క అడుగైనా వెయ్యలేని పరిస్థితి ఏర్పడే సరికి, అదృష్టవశాన ఒక చెట్టు కనిపించింది. బతుకు జీవుడా అని, ఆయన ఆ చెట్టు నీడలో చేరాడు. ఆకలి దహించుకు పోతున్నది, కాని వసుగుప్తుడు వెంటనే ఆహారం తినటం వృథా అనుకున్నాడు. ఆయనకు దాహం మరింతగా బాధిస్తున్నట్టు కనబడింది. అందుచేత ఆయన తన తిత్తి తీసి, అందులో నుంచి నీరు ఒక గుటక తాగి, నివ్వెరపోయాడు. అది ఉత్త నీరు కాదు, చక్కెర కలిపిన నీరు!

"నా కోడలు ఇంత దుబారా మనిషేం? ఇలా అయితే ఇల్లు గుల్లచేస్తుందే!" అనుకుంటూ వసుగుప్తుడు నీరు తాగటం మానేసి, ఆహారం తినటానికి పొట్లం విప్పాడు. వెంటనే కుంకుమపువ్వు వాసనా, నెయ్యి వాసనా గుప్పున కొట్టింది.

"ఛీ, ఛీ! ఎంత దుబారా మనిషి! నేను ఇల్లు వదలక ముందే ఇలా చేసిందే, నేను లేకపోతే ఉన్న డబ్బంతా మాయమై పోదూ?" అనుకుని వసుగుప్తుడు చిత్రాన్నమంతా కాకులకు వేసేసి, తిత్తి



లోని చక్కెర పానకం సమీపంలో ఉన్న
ఒక బిలంలో పోసేశాడు.

మరు క్షణమే ఆ బిలంలో నుంచి ఒక
నల్లని నాగుపాము పైకి వచ్చి, పడగ
విప్పి వసుగుప్తుడి కేసి తదేకంగా చూడ
సాగింది. దాన్ని చూడగానే వసుగుప్తుడు
ఒక్క క్షణం పాటు కొయ్యబారి
పోయాడు. మరుక్షణం ఆయనకు ఎక్కడ
లేని శక్తి వచ్చింది. ఆయన వచ్చిన
దారినే అతి వేగంగా పరిగెత్తసాగాడు.

కొంత దూరం పరిగెత్తే సరికి ఆయ
నకు అమితంగా ఆయాసం వచ్చింది.
ఊపిరి అందలేదు. ఆయన ఆగి చూసే
సరికి, నాగుపాము ఆయనను తరుముతూ
రావటం కనిపించింది. ఆయన కిందపడి
పోయి, కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.

"అయ్యా, లేవండి. మీకు ఒక వరం
ఇచ్చి పోతాను." అన్న మాటలు విని
పించాయి.

అనుమానంగా వసుగుప్తుడు కళ్ళు
కొంచెం తెరిచి చూసే సరికి, ఆయనకు
తన పక్కనే ఒక అందమైన యువకుడు
కనబడ్డాడు. పాము జాడ లేదు.

వసుగుప్తుడు ధైర్యంగా లేచి కూర్చుని,
"ఎవరు నువు ?" అని అడిగాడు.

"నేను నాగరాజు కొడుకును. ఆ చెట్టు
కింది బిలంలో నివసిస్తూ ఉంటాను. నేను
దాహంతో చచ్చిపోతున్న సమయంలో
మీరు తియ్యని నీరు పోసి, నా ప్రాణాలు
నిలబెట్టారు. మీరు ఏది కోరుకుంటే
అదిచేస్తాను." అన్నాడు ఆ యువకుడు.

"నాకు జీవితంలో ఒకే కోరిక. అది
డబ్బు సంపాదించటమూ, కూడబెట్టట
మూనూ. నాకు ఏ వరమూ అక్కర్లేదు.
నన్ను క్షేమంగా ఇంటికి పోనిస్తే, అదే
పదివేలవరాలు!" అన్నాడు వసుగుప్తుడు.

"అలాకాదు. మీరు నా నుంచి ఏదన్నా
వరం పొందితేగాని, మిమ్మల్ని
పోనియ్యను." అన్నాడు యువకుడు.

వసుగుప్తుడు కొంచెం ఆలోచించి, "ఒక
పని చేద్దామా? మా కోడలు చాలా తెలి

వైనది. నువు నాతో మా యింటికిరా. నా కోడలు కోరమన్న వరం కోరుతాను. దాన్ని ఇచ్చి నీ దారిన నువు వెళ్ళు," అన్నాడు.

యువకుడు సరే నన్నాడు. ఇద్దరూ కలిసి వసుగుప్తుడి ఇంటికి వెళ్ళారు.

వసుగుప్తుడు తన కోడలిని పిలిచి, సంగతంతా చెప్పి, "నువు నీటిలో చక్కెర కలిపిన కారణంగా ఈ అబ్బాయి వరం తీసుకోమని నన్ను వేధిస్తున్నాడు," అన్నాడు.

కోడలు జవాబు చెప్పేలోపల వసుగుప్తుడి భార్య, "ఏమండీ, బోలెడంత ధనం వరంగా కోరుకోండి," అన్నది.

వసుగుప్తుడు చిరాకుపడి, "ధనానికి పరిమితి ఏమున్నది? అదిగాక డబ్బు కోరుకుంటే, డబ్బు సంపాదించటంలో ఉండే ఆనందం ఏమయేటట్టు?" అన్నాడు.

ఇంతలో ఆయన కోడలు, "మామయ్యా, మీకు అభ్యంతరం లేకపోతే నేను చెప్పినట్టు వరం కోరండి," అన్నది.

"చెప్పమ్మా, చెప్పు!" అన్నాడు వసుగుప్తుడు.

"మీ ధనానికి మీరే యజమాని కావాలని వరం కోరండి," అన్నది వసుగుప్తుడి కోడలు. వసుగుప్తుడికి నవ్వొ



చ్చింది. తన ధనానికి తానే కదా యజమాని? తనకన్న ఇంకో యజమాని ఎవరున్నారు? అయినా ఆయన ఆ యువకుణ్ణి అదే వరం కోరాడు.

"అలాగే వరం ఇచ్చాను," అని ఆ యువకుడు అదృశ్యమయ్యాడు.

రోజులు గడుస్తున్న కొద్దీ వసుగుప్తుడిలో విచిత్రమైన మార్పు రాసాగింది. ఆయన ధనం సంపాదించటం కోసం తహతహలాడటం క్రమంగా తగ్గిపోయింది. ఆయన తన తాళపు చెవుల గుత్తి తన భార్యకు ఇచ్చి, "ఇంటి పెత్తనం ఆడది చూడాలి. ఇంటి ఖర్చు గురించి నన్ను బాధపెట్టక, అంతా నువే చూసుకో.

ఇంటో ఏ లోటూ లేకుండా చూడు. సుఖ పడటానికి కాకపోతే డబ్బు దేనికి?'' అన్నాడు.

కొంత కాలానికి ఆ ప్రాంతాల తీవ్రమైన కరువు వచ్చింది. వసుగుప్తుడు తన ధాన్యాగారాలు తెరిపించి బీదలకు ధాన్యం పంచి పెట్టాడు; తిండిగింజల కోసం వచ్చిన వాణ్ణి ఎవణ్ణీ ఉత్త చేతులతో పంప వద్దని శాసనం చేశాడు. మహా దాతగా ఆయన పేరు ప్రసిద్ధిలోకి వచ్చింది.

బేతాళుడీ కథ చెప్పి, ''రాజా, నాకు అనేక సందేహాలు కలుగుతున్నాయి. వసుగుప్తుడి కోడలు నిజంగా తెలివి గల దైతే అలాటి అర్థంలేని వరం కోరమని ఎందుకు అన్నది? అది అర్థంలేని వరం అని తెలిసి కూడా వసుగుప్తుడు దాన్ని ఎందుకు కోరాడు? ఆ వరానికీ, అయనలో మార్పుకూ సంబంధం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపో తుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''తన కోడలు కోరమన్న వరం అర్థంలేని దని వసు గుప్తుడు అపోహ పడ్డాడు; కాని ఆ యువ కుణ్ణి ఎలాగైనా వదిలించు కోవటానికి ఆ వరమే కోరాడు. అది అర్థంలేని వరం ఎంతమాత్రమూ కాదు. ఆ వరం కోరే దాకా వసుగుప్తుడు తన ధనానికి బానిస; దానికోసం జీవితంలో ఇంకే ఆశయమూ లేకుండా చేసుకుని, దానికి రక్షకభటు డుగా కాపలా కాశాడు. ధనమే అయనకు యజమాని అయింది. అది తన సేవ కుడికి చిన్నమెత్తు సుఖం చేకూర్చలేదు; ఆఖరుకు, రుచికరమైన పదార్థాలు నోట బెట్టుకునే శక్తికూడా ఆయనకు లేకుండా చేసింది. వరం పొందినాక వసుగుప్తుడు నిజంగా ధనాన్ని శాసించటం ప్రారం భించాడు. అది ఆయన మనస్సుకు వేసిన సంకెళ్లు తెగిపోయాయి,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)






# పిల్లి పిల్ల

రతన్‌పూర్ రాజైన బోపదేవుడు దొడ్డ ప్రభువు. ఆయన భార్య రాణీ ఇందుమతి మహా ఇల్లాలు. వారికి సంతానం కలగ లేదు. పది హేనేళ్ళపాటు పిల్లలు కలగక పోయేసరికి రాజూ, రాణీ కూడా మనో వ్యాధి చెందారు. ప్రజలు కూడా తమ రాజుకు సంతానప్రాప్తి కలగాలని ప్రార్థ నలు చేశారు. కాని అందువల్ల ప్రయో జనం లేకపోయింది.

ఇంతలో రాజభవనానికి ఒక మునీశ్వ రుడు వచ్చాడు. ఆయన బోపదేవుడితో ఏకాంతంలో, "రాజా, నువు కిందటి జన్మలో చేసిన పాపం ఫలితంగా ఈ జన్మలో నీకు పిల్లలు కలగలేదు. నువు రెండేళ్ళపాటు హిమాలయాలలో తపస్సు చెయ్యగలవా ?" అన్నాడు.

మునీశ్వరుడి సలహా ప్రకారం బోప దేవుడు రాజ్యభారాన్ని రాణీ ఇందుమతికి అప్పగించి, మునీశ్వరుడి వెంట హిమా లయాలకు వెళ్ళి, అక్కడ తపస్సు ప్రారంభించాడు. ఎండ అనక, వాన అనక, మంచు అనక ఆయన రెండేళ్ళ పాటు దీక్షతో తపస్సుచేశాడు.

రెండేళ్ళు పూర్తి కాగానే బోపదేవుడి వద్దకు మునీశ్వరుడు వచ్చి, "రాజా, నీ తపస్సు పూర్తి అయింది. నువు ఇంటికి తిరిగి వెళ్ళవచ్చు. ఈ విల్లూ, బాణమూ తీసుకో. నువు వెళ్ళే దారిలో పుష్పవనం ఒకటి ఉన్నది. అందులో అడవి పందులు, రంగు రంగులవి సంచరిస్తూ ఉంటాయి. వాటిలో ఏదైనా ఒక పందిని ఈ బాణంతో కొట్టి, దాని మాంసం నీ భార్య చేత తినిపించు. నీకు సంతానం కలుగుతుంది," అన్నాడు.

బోపదేవుడు ఆ విల్లూ, బాణమూ తీసు కుని బయలుదేరాడు. ఆయన పుష్ప

వనాలు ఉన్న చోటుకి వచ్చేసరికి అక్కడ అడవి పందులు, తెల్లవీ, నల్లవీ, మగవీ, ఆడవీ, మందలు మందలుగా తిరుగు తున్నాయి. ఆయన వేసిన బాణం ఒక నల్లని ఆడపందిని కొట్టింది. ఆయన దాని మాంసం తీసుకుని, ఇంటికి తిరిగి వచ్చి, దాన్ని తన భార్యకు తినిపించాడు. రాణీ ఇందుమతి గర్భవతి అయింది.

రాజు తనకు ముద్దులు మూట గట్టే కొడుకు కలుగుతాడని కలలు కన్నాడు. రాజ్యంలో అందరిదీ మేలిమి బంగారు శరీరచ్ఛాయ. కానీ ఇందుమతి కారు నలుపురంగు గల కుమార్తెను కన్నది!

ఇది చూసి అందరూ నిరుత్సాహం చెందారు. పెద్దవాళ్ళు మాత్రం, ''ఇంత కాలానికి రాజుకు ఒక బిడ్డ కలిగింది, అంతేచాలు.'' అని సరిపెట్టుకున్నారు.

బోపదేవుడు బొత్తిగా నిస్పృహ చెంది, ''నేను తపస్సు చేసింది ఈ నల్ల పిల్లను కనటానికా?'' అన్నాడు.

ఇందుమతి తన కుమార్తె ముఖం చూడ నిరాకరించింది.

రాజపరివారం వాళ్ళు ఇలా చర్చించు కున్నారు:

''రాజుగారు కుంగిపోయారు. ఆయన రాచకార్యాలు కూడా చూడటం లేదు. పాపం, ఆ బిడ్డ వల్ల నేరం ఏమున్నది? ఆమె నల్లగా పుట్టటం దైవికంగా జరిగింది. రాజదంపతుల వైఖరి ఎలాగైనా మారే ఉపాయం చూడాలి.''



కాని ఆ ఉపాయం ఏమిటో ఎవరూ చెప్పలేకపోయారు. అప్పుడు ఆస్థాన ఐంద్రజాలికుడు సోమనాధుడు, "నా ఇంద్రజాలం ప్రయోగించనా ఏం?" అన్నాడు.

"తప్పకుండా ప్రయోగించు. నీ మాట నాకు తట్టనే లేదు. నీ ఇంద్రజాలంతో రాజు మనసూ, రాణీ మనసూ మార్చు. విజయీభవ!" అన్నాడు ప్రధానమంత్రి.

మర్నాడు ఉదయం సోమనాధుడు తన పరికరాలతో సహా రాజభవనానికి వెళ్ళాడు. ఆ పరికరా లేవంటే, ఒక లోహపు గొట్టమూ, దాన్ని నిలువుగా అమర్చటానికి ఒక స్టాండూ, ఒక తెల్లని బంతీ మాత్రమే. అతను ఆ గొట్టాన్ని స్టాండు సహాయంతో నిలువుగా అమర్చి, "మహారాజా, మహారాణీ! నేను మీలాగా పుణ్యాత్ముణ్ణి కాను, తపస్సు చేసినవాణ్ణి కాను; సాదా మనిషిని. అయినా నేను మీకు ఒక అద్భుతం చూపిస్తాను!" అన్నాడు.

ఇలా అని సోమనాధుడు తన చేతిలో ఉన్న తెల్లని బంతిని, నిలువుగా ఉన్న గొట్టం పై భాగంలో వేసి, తన మంత్ర దండంతో కిందికి తోశాడు. ఆ బంతి గొట్టం దిగువ భాగంలో నుంచి, కింద ఉన్న బల్ల మీద పడింది. అతను దాన్ని తీసి మళ్ళీ గొట్టం పై భాగంలో నుంచి, మంత్రదండంతో కిందికి తోశాడు. మళ్ళీ బంతి కింద పడింది, కాని అది ఇప్పుడు తెల్లగా లేదు, నల్లగా ఉన్నది.



''చూశారా, మహారాజా, మహారాణీ? తెలుపు కాస్తా నలుపు అయిపోయింది. తెలుపూ, నలుపూ అనేవి నిజం కాదు, భ్రమ! జాగ్రత్తగా గమనించండి,'' అంటూ సోమనాథుడు నల్ల బంతిని గొట్టం పై భాగంలో వేసి, మంత్రదండంతో తోశాడు. ఈసారి బంతి కింద పడినప్పుడు నల్లగా ఉండక, తెల్లగా ఉన్నది.

''చూడండి! రంగులో ఏమీ లేదు. అది శాశ్వతం కాదు. రాజకుమారి ఇవాళ నల్లగా ఉండవచ్చు. రేపు ఈ రంగు మారదని ఎవరు చెప్పగలరు? ఆమె దైవ శక్తి వల్ల పుట్టింది. దైవం ఆమె వెంట ఉంటాడు,'' అన్నాడు సోమనాథుడు.

సోమనాథుడి ఇంద్రజాలం పని చేసిందనే చెప్పాలి. ఎందుకంటే, ఆ రోజు నుంచీ రాజదంపతులు తమ బిడ్డను చాలా ప్రేమతో చూడసాగారు.

ఆ సాయంత్రం సోమనాథుణ్ణి అతని భార్య, ''బంతి రంగు ఎలా మార్చారు?'' అని అడిగింది.

''అదా! చాలా చాలా తేలిక. ఈ గొట్టం చూడు. ఇది బంతి పరిమాణం కన్న కొద్దిగా చిన్నది. అందుచేత బంతి జారి పడటానికి బిగుతుగా ఉంటుంది. మంత్ర దండంతో కాస్త తొయ్యాలి. అందులో రెండు బంతులు ఉండగా ఇంకా కొంచెం జాగా ఉంటుంది. ప్రదర్శనకు పూర్వమే ఆ గొట్టంలో ఒక తెల్ల బంతీ, దాని మీద ఒక నల్లబంతీ ఉంచాను. నేను పైనుంచి తెల్ల బంతిని తోసినప్పుడు, దిగువన ఉన్న తెల్లబంతి కింద పడింది. కాని ఆ తెల్ల బంతిని మళ్ళీ తోసినప్పుడు దిగువకు వచ్చిన నల్లబంతి కింద పడింది. ఆ నల్ల బంతిని తోసే సమయానికి కింద తెల్ల బంతి సిద్ధంగా ఉన్నది,'' అన్నాడు సోమనాథుడి.

''ఛీ! ఇంత తేలిక మోసమా?'' అన్నది సోమనాథుడి భార్య.

''చెబితే తేలికా! చూసే వాళ్ళకు అద్భుతం!'' అన్నాడు సోమనాథుడు నవ్వుతూ.



# నాలుగోవాడు

కృష్ణశర్మ అనే గురువు ఒక గురుకులాన్ని నడిపి, ఎంతో ఖ్యాతి సంపాదించి, వృద్ధుడైపోయి, తన అనంతరం గురుకులాన్ని నడిపే దక్షత గలవాణ్ణి తన శిష్యులలో నుంచి ఎన్నుకోదలచాడు. అలాంటి దక్షత గలవాళ్ళు ఆయనకు నలుగురు కనబడ్డారు. వారిలో మంచి తను ఒకణ్ణి ఎన్నుకోవాలి.

ఆయన వారిని నలుగురినీ పిలిచి, "ఈ గురుకులాన్ని నిర్వహించే పని మరెవరికైనా అప్పజెప్ప నిర్ణయించాను. మీలో దాన్ని నిర్వహించగలనన్న విశ్వాసం గలవాడు ముందుకు వస్తే వాడికి ఒక పరీక్ష పెడతాను," అన్నాడు.

"నాకు పరీక్ష పెట్టండి. నేను గురుకులాన్ని నిర్వహించగలను," అన్నారు ముగ్గురు.

"నీ మాట ఏమిటి?" అని గురువు నాలుగోవాణ్ణి అడిగాడు.

"నేను మీ శిష్యుణ్ణి. నా యోగ్యతాయోగ్యతలు నాకు తెలిసిన దానికన్న మీకే బాగా తెలియాలి. అందుచేత నేను ముందుకు రాలేదు," అన్నాడు నాలుగో వాడు.

గురువు వాడినే గురుకులాన్ని నిర్వహించటానికి నియమించాడు.





# చిన్నడి యుక్తి

పూర్వం కొండప్రాంతంలో ఒక చిన్న గ్రామం ఉండేది. ఆ ప్రాంత మంతా అనాదిగా ఒక జమీందారు కుటుంబానికి చెందినది. గ్రామస్థులు అమాయకులు. జమీందారు కూడా అమాయకుడే. గ్రామస్థులు పొలాలలో పండిన ధాన్యంలో కొంత భాగం జమీందారుకు పంపేవాళ్ళు. అలాగే కూరగాయలు వగైరాలు కూడా జమీందారు ఇంటికి చేరేవి. జమీందారు ఎవరికీ జీతాలూ, బత్తేలూ ఇచ్చేవాడు కాడు. ఎందుకంటే, ఆ ఊరికి సంబంధించిన భూములన్నీ జమీందారువే. గ్రామంలో ఉండేవాళ్ళంతా ఆయన పాలెగాళ్ళే. ఇదీ అక్కడి అనవాయితీ.

జమీందారుకు మాంసం అంటే చాలా ఇష్టం. గ్రామస్థులు వంతులు వేస్కుకుని, రోజూ ఒక వీశెడు మాంసం జమీందారుకు పంపాలి. ఇది దాటరాని నియమం. ఎవరన్నా ఈ నియమాన్ని ఉల్లంఘిస్తే తీవ్రమైన శిక్ష పొందేవారు.

ఆ ఊళ్ళో ఒక చివరగా చిన్నడు అనే వాడు చిన్నపాక వేసుకుని ఉండే వాడు. వాడికి ఎవరూ లేరు; కోళ్ళూ, బాతులూ పెంచుకుని జీవిస్తూ ఉండే వాడు.

ఒకరోజు జమీందారుకు మాంసం తేవటం వాడి వంతు వచ్చింది. మాంసం కోసం వాడు అడవికి వెళ్ళాడు. అదృష్ట వశాన వాడికి అడవిలో పెద్దలేడి చిక్కింది. దానికోసం వాడు చాలా శ్రమపడ్డాడు. దాన్ని తీసుకుపోయి జమీందారుకు ఇయ్యటం వాడికి ఇష్టం లేకపోయింది. జమీందారీలో గల అనవాయితీలను మార్చటానికి వాడికి ఒక ఉపాయం కూడా తట్టింది.

చిన్నడు ఆ రోజంతా అడవిలోనే ఉండిపోయాడు. వాడు లేడి తల నరికి,

బూర్లె నాగేశ్వరరావు

మంటల్లో కాల్చి, కడుపు నిండా తిని, హాయిగా పడుకున్నాడు. ఆ రోజు జమీం దారుకు మాంసం అందలేదు. ఆయన కోపంతో చిందులు తొక్కి, కొరడా తెప్పించి, చిన్నణ్ణి శిక్షించటానికి ఎదురు చూడసాగాడు.



మర్నాడు ఉదయం చిన్నడు లేడి మొండాన్ని భుజాన వేసుకుని రావటం చూడగానే జమీందారు ఆగ్రహం చప్పున చల్లారి పోయింది. చిన్నడు తన కోసం అంత మాంసం తెచ్చినందుకు ఆయన వాణ్ణి తన మనసులో మెచ్చుకున్నాడు.

చిన్నడు లేడి మొండాన్ని జమీందారు ముందు పెట్టి, రొప్పుతూ నిలబడ్డాడు. వాణ్ణి చూసి జాలిపడుతూ జమీందారు, "ఏరా, చిన్నా? నిన్న రాలేదు. ఈ వెధ వది నిన్ను అడవి అంతా తిప్పి ఉంటుంది!" అన్నాడు.

చిన్నడు తల అడ్డంగా తిప్పి, "కాదు, కాదు. దీనికంతా పెద్ద కథ ఉన్నది. ఒక కుందేలును చంపి తెస్తూ, దారిలో ఒక మర్రిచెట్టు కింద క్షణంసేపు ఆగాను. అంతలో, భుజాన ఉన్న కుందేలు శవం చెట్టు మీదికి ఉరికింది. బిత్తరపోయి పైకి చూచే సరికి, కళ్ళు జిగేలు మనే వెలుగు కనిపించింది. ఆ వెలుగులో ఒక స్త్రీ కనిపించి, 'భ్రష్టుడా, ఇంతేనా నీ విశ్వాసం? జమీందారంటే ఎవరను కుంటున్నావు? మీ పాలిటి దేవుడు! మీరు ఉండే భూమీ, తినే తిండీ, తాగే నీరూ, పీల్చే గాలీ జమీందారు గారివి. అలాంటి వాడి ఋణం తీర్చుకునే టందుకు నువు ఈ చిన్న కుందేలును తీసుకు పోతున్నావా? ఇలా చేసే వాళ్ళను ఈ లోకంలో ఉంచను. ఈ మాట అంద రికీ చెప్పు,' అన్నది. అంత దాకా ఎందుకు? మొన్న చచ్చిన గంగరాజు, గేదెపాలు మీకు పంపించకుండా తాగి నందుకు ఈ దేవతే చంపిందట! తన పాదున కాసే పొట్లకాయలు రహస్యంగా కోసుకు తిన్నందుకే సంగులు మంచాన



పడిందట! వెధవలు ఇంక దొంగవేషాలు వేశారో, దేవతే చూసుకుంటుంది. నేను వెంటనే తిరిగి అడవిలోకి వెళ్ళి ఈ లేడిని తెచ్చాను. దేవత నన్ను చూసి మెచ్చుకుని, దాని తల ఇయ్యమన్నది; ఇచ్చేశాను,'' అని కథ అల్లి చెప్పాడు.

జమీందారు పరమానంద భరితుడై, చిన్నణ్ణి చాలా దయగా చూసి, దేవత వార్త తెచ్చినందుకు వాణ్ణి తెగమెచ్చుకున్నాడు.

ఈ వార్త ఊరంతా పాక్కింది. గ్రామస్థులు జమీందారుకు ఎప్పటి కన్న ఎక్కువగా కానుకలు అందించ సాగారు. వాళ్ళకు దేవత భయం పట్టుకున్నది. చిన్నడు గొప్పవాడయాడు. వాడికి జమీందారు సేవతోనే సరిపోతున్నది. తన గుడిసెకు వెళ్ళటం మానేశాడు.

జమీందారు ఒక రోజు చిన్నడికి రెండు కోడి పుంజు లిచ్చి, దేవతకు బలిపెట్టి రమ్మన్నాడు. వాడు అడవిలోకి వెళ్ళి, రెండు పుంజులనూ కాల్చుకు తిని, మర్నాడు తిరిగి వచ్చాడు.

''దేవత ఏమైనా చెప్పిందా?'' అని జమీందారు చిన్నణ్ణి అడిగాడు.

''దేవత మీ భక్తికి మెచ్చుకున్నది. ఇక్కడే ఉండి పోతాననీ, తన కోసం ఒక ఆలయ్యం కట్టించమనీ అన్నది. ఆ ఆలయం కట్టటానికి పాపిష్ఠి ప్రజల సొమ్ము వాడ వద్దనీ, మీ డబ్బుతోనే కట్టించమనీ అన్నది,'' అన్నాడు చిన్నడు.

''ఆ దేవత అనుగ్రహం మనకు ఉండాలే గాని ఎంత ఖర్చయినా చేస్తాను,'' అన్నాడు జమీందారు, చేతులెత్తి నమస్కారం చేస్తూ.

గ్రామంలో ఎవరికి ఏ సంకటం కలిగినా ఆ దేవత మహిమే అని చిన్నడు ప్రచారం చేసి జనాన్ని అదరగొట్ట సాగాడు. జమీందారు దేవతకు పూర్తిగా దాసానుదాసుడై పోయాడు. ఆయన డబ్బును మంచి నీరులాగా ఖర్చుచేసి, ఊరి బయట దేవతకు పెద్ద ఆలయం కట్టించాడు. దేవ

తకూ జమీందారుకూ మధ్య సంధాన కర్త చిన్నడు. ఆలయంలో ఏది ఎలా ఉండాలో దేవతను అడిగి చిన్నడు చెప్ప టమూ, జమీందారు ఆ ప్రకారమే చెయ్య టమూ జరిగింది. చిన్నడు ఆలయంలో అతి భయంకరమైన శక్తి స్వరూపం గల విగ్రహాన్ని ప్రతిష్ఠింప జేశాడు.

ఆలయం పూర్తి అయిన రోజున గొప్ప ఉత్సవమూ, ప్రజలందరికీ సంతర్పణా జరిగాయి. ఆలయం ఖర్చు యావత్తూ జమీందారే భరించాడు. దానికి తగ్గట్టు ప్రజల నుంచి ఆయన రాబడి కూడా హెచ్చింది.

ఆ సంవత్సరమే ఆ ప్రాంతంలో కరువు పరిస్థితి ఏర్పడింది. వానలు లేవు. పంటలు లేవు. జనం తిండికి మాడు తున్నారు. జమీందారు దగ్గిర అంతులేని ధాన్యం పోగుపడి ఉన్నది. అయినా ఆయన కూడా కరువు చూసి భయపడి, ధాన్యపు కొట్లకు జాగ్రత్తగా తాళాలు బిగించాడు.

ఒక రోజు ఉదయం చిన్నడు చిరిగి పోయిన బట్టలతో, మట్టి గొట్టుకుని, కుంటు కుంటూ, ముక్కుతూ, మూలు గుతూ జమీందారు వద్దకు వచ్చాడు.

జమీందారు వాణ్ణి చూసి, "నీకే మయిందిరా, చిన్నడూ?" అని అడిగాడు.

"దేవత అంటున్నది, ఈ ఊళ్ళో ఒక్కడు కూడా ఆకలితో చావగూడ దుట!" అన్నాడు చిన్నడు.



''అందుకు మనం ఏం చెయ్యాలిట?" అని జమీందారు అడిగాడు.

''వెంటనే అందరికీ గింజలు పంచాలట!" అన్నాడు చిన్నడు.

''అలా చెయ్యకపోతే ఏమవుతుందిట?'' అని జమీందారు ఆదుర్దాగా అడిగాడు.

''ఊరు కాలి బూడిద అవుతుందట!" అన్నాడు చిన్నడు.

''ధాన్యపు కొట్లు కూడా తగలబడి పోతాయేమో! ఒరే, చిన్నడూ, ఎందుకైనా మంచిది. దేవత చెప్పినట్టు చేద్దాం!" అన్నాడు జమీందారు.

''మీరు ఊరుకోండీ! ఆ దేవత వన్నీ ఉత్త బెదిరింపులేనూ! ఆ మాట ఆవిడతోనే అన్నాను. జమీందారుగారు ఎంతో కాలంగా చేర్చిపెట్టిన ధన ధాన్యాలు ఊరి మీద గుప్పించటమా అన్నందుకు నా గొంతు పిసికింది! మీ రూరుకోండి. ఏం చేస్తుందో చూద్దాం!'' అన్నాడు చిన్నడు.

జమీందారు గుండె దడదడ లాడుతున్నది. ఇంతలోనే దూరంగా పొగ లేచింది. ఇళ్ళు అంటుకున్నట్టున్నది. అది చూడగానే జమీందారు చిన్నడితో, ''నీకేమైనా బుద్ధి ఉందిరా? దేవత అంటే ఏమిటనుకున్నావు? ఇదిగో, ఈ తాళపు చెవులు తీసుకుపోయి, ధాన్యం కొట్లుతెరిచి, అందరికీ పంచు,'' అన్నాడు.

చిన్నడు ఏదో చెప్పబోతే ఆయన, ''నువు నాకేం చెప్పక్కర్లేదు, వెళ్ళు!'' అని వాణ్ణి తరిమాడు.

చిన్నడు పన్నిన యుక్తితో గ్రామస్థులు కరువు నుంచి క్షేమంగా బయట పడ్డారు. జమీందారు బతికి ఉన్నంత కాలమూ, ప్రజలు తప్పు చేస్తే శిక్షించే భారం దేవతకే వదిలేసి తానుగా ఎవరినీ శిక్షించలేదు. ప్రజలు కూడా దేవతకు భయపడి తాము కష్టపడి పనిచేసి, అనవాయితీని చక్కగా అమలు జరిపారు. జమీందారు మంచివాడు అనిపించుకుంటూ, మరింతగా వారి నుంచి లాభంపొందాడు.





# ప్రాయశ్చిత్తం

ఒక గ్రామంలో కృష్ణయ్య అనే వడ్డీ వ్యాపారి ఉండేవాడు. అతను దయా దాక్షిణ్యాలు లేకుండా వడ్డీలకు వడ్డీ వసూలు చేసేవాడు. ఋణస్థులను పీడించేవాడు. గ్రామస్థులకు అతనంటే చాలా కసిగా ఉండేది.

ఒకనాడు ఊళ్ళో వాళ్ళు కొందరు పూటకూళ్ళ పెద్దమ్మ ఇంట కలుసుకుని కృష్ణయ్యకు శాస్తి చెయ్యటానికి ఒక పథకం ఆలోచించారు. వాళ్ళు వేసిన పథకంలో పూటకూళ్ళ పెద్దమ్మ ముఖ్య పాత్ర వహించవలసి ఉన్నది. అందు కామె ఒప్పుకున్నది.

కొద్ది రోజుల అనంతరం ఆ వూళ్ళో గంగమ్మ జాతర బ్రహ్మాండంగా జరిగింది. జాతరకు ఎక్కడెక్కడి నుంచో ప్రజలు తండోప తండాలుగా వచ్చారు. అప్పుడు పూటకూళ్ళ పెద్దమ్మ పై నుంచి కిందికి అంతులేని బంగారు ఆభరణాలు ధరించి జాతరలోకి వెళ్ళి, అందరికీ కనిపించే లాగా తెగ తిరిగింది.

జనమంతా పెద్దమ్మ నగల కేసి తేరి పారజూశారు. ఆ నగలన్నీ ఊళ్ళో వాళ్ళు ఆమెకు అరువు ఇచ్చినవే.

ఎరిగిన వాళ్ళు పెద్దమ్మను చూసి, ''కూడు అమ్ముకుని బతికే పెద్దమ్మ ఎంత బంగారం చేర్చిందో!'' అని ఆశ్చర్య పోయారు. అదే సమయంలో ఘరానా దొంగలు నలుగురు ఆమె నగల మీద కన్నువేశారు.

జాతర ముగిసింది. ఆ రాత్రి దొంగలు నలుగురూ పెద్దమ్మ ఇంట్లో ప్రవేశించి, పెద్దమ్మ పీక పట్టుకుని, ''గంగమ్మ జాతరలో వేసుకు తిరిగిన, నీ నగలన్నీ ఎక్కడ దాచావు? చెప్పు! లేకపోతే గొంతు పిసికి చంపేస్తాం!'' అన్నారు.

సురభి రేవతి

పెద్దమ్మ వణికిపోతూ, "నాయన్లారా! ఇల్లు భద్రం లేదని, నా నగలన్నీ షావుకారు కృష్ణయ్య ఇంట్లో దాచుకుంటాను. ఎప్పుడన్నా పండగలూ, పబ్బాలూ వచ్చినప్పుడు తీసి పెట్టుకుంటాను. తిరిగి మళ్ళీ ఆయన ఇంట్లోనే పెట్టేస్తూ ఉంటాను, నాయనా!" అన్నది.

"ఇప్పుడే వెళ్ళి షావుకారు ఇల్లు గాలిస్తాం. అక్కడ నగలు లేకపోయాయో నిన్ను ప్రాణాలతో వదలం. జాగ్రత్త!" అని దొంగలు పెద్దమ్మను బెదిరించి, ఆమెను బంధించి, నోట్లో గుడ్డలు కుక్కి, అప్పుడే కృష్ణయ్య ఇంటికి వెళ్ళారు.

దొంగలను చూడగానే కృష్ణయ్య కొయ్యబారిపోయి, కూలబడ్డాడు.

దొంగలు ఆయనను ఇనప్పెట్టె వద్దకు తీసుకుపోయి, దాన్ని తెరవమన్నారు.

కృష్ణయ్య చేతులు జోడించి, "ఒరే, నాయన్లారా, నా వద్ద ఏముందిరా? మీకు ఎవరు చెప్పారురా? ఏమీ లేదే!" అన్నాడు.

"మాకు ఎవరూ చెప్పలేదు. ముందు పెట్టె తెరు!" అంటూ బాకులు చూపారు దొంగలు.

కృష్ణయ్య వణుకుతున్న చేతులతో రొండి నుంచి తాళాలు తీసి, ఇనప్పెట్టె తెరిచాడు. దాని నిండా ఊళ్ళోవాళ్ళు కుదువబెట్టిన నగలున్నాయి.

దొంగలు అమితానందంతో, ఇనప్పెట్టె ఖాళీ చేసి, తమ సంచుల నిండా నగా, నట్రా నింపుకుని, పూటకూళ్ళ పెద్దమ్మ ఇంటికి వెళ్ళి, "పెద్దమ్మా, నిజం చెప్పావు. ఇవి ఉంచుకో!" అని ఆమెకు కొన్ని నగలిచ్చి, వెళ్ళిపోయారు.

అయితే ఈ పథకమంతా వేసిన పెద్దలు ముందుగానే మనుషులను ఏర్పాటు చేసి, దొంగలు ఊరిపొలిమేర దాటగానే వాళ్లను పట్టుకుని, వాళ్ళు కృష్ణయ్య ఇంట కాజేసిన నగలను, రహస్యంగా తాకట్టు ఉంచిన వారికి చేర్చారు. పెద్దమ్మ కూడా తనకు దొంగలిచ్చిన నగలను ఎవరివి వారికి ఇచ్చేసింది.



# 155. డో డో

డో డో అనే పక్షిజాతి అంతరించి పోయింది. 1638 లో కొందరు నావికులు మారిషస్ దీవిలో దాన్ని చూశారు. 1681 లో ఆఖరు డో డో చచ్చి పోయిందట. అటు తరవాత అలాటి పక్షి ఒకటి సృష్టిలో ఉండేదన్న సంగతి కూడా అనుమానించటం జరిగింది. అయితే 1865 లో డో డో అస్థిపంజరం ఒకటి దొరికింది. అస్థిపంజరాన్ని పరిశీలించిన శాస్త్రవేత్తలు డో డో రెక్కలు ఎగరటానికి పనికిరావని తేల్చారు.





# అపాత్రుడికి వరం

ఒక ఊళ్ళో రంగడు అని ఒక పనికి మాలిన కుర్రవాడు ఉండేవాడు. వాడి తల్లి వడలు చేసి అమ్ముతూ ఇల్లు గడిపేది. రంగడికి చదువు ఏ మాత్రమూ అంటలేదు. కాని వాడు మాత్రం తాను చాలా తెలివిగల వాడిననీ, తన తెలివితేటలు ఎవరూ అర్థం చేసుకొనటం లేదనీ అనుకునే వాడు. వడలు అమ్మటంలోనైనా రంగడు తనకు సహాయ పడతాడేమో, తాను మరేదన్నా పనులు చూసుకోవచ్చునని తల్లి ఆశపడింది. కాని, రంగడు వడలు కొనే వాళ్ళతో పోట్లాటలు తెచ్చుకుని, తల్లి ఆశ నిరాశచేశాడు. చివరకు ప్రాణం విసిగి తల్లి వాణ్ణి తిట్టి, ఇంటి నుంచి వెళ్ళగొట్టింది.

రంగడికి పౌరుషం వచ్చింది. తన తెలివి తేటలు అందరూ గుర్తించేటట్టు చెయ్యాలని నిశ్చయించుకుని, వాడు ఇల్లు వదిలి, ఊరి అవతల ఉన్న అరణ్యం ప్రవేశించాడు. ఎక్కడా మనుష్య సంచారంలేని అడవిలో వాడికి కొంచెం భయం వేసింది. దానికి తోడు చీకటి కూడా పడబోతున్నది. వాడు ఒక చెట్టు ఎక్కి కూర్చున్నాడు.

అదే చెట్టు మీద చాలా కాలంగా ఒక భూతం ఉంటున్నది. ఆ భూతానికి ఒక చెల్లెలు ఉండేది. ఒక మంత్రవేత్త ఆమెను ఒక సీసాలో బంధించి, ఆ చెట్టు మొదట్లో పాతిపెట్టాడు. చెట్టుమీద ఉన్న భూతం తానై నేల తవ్వి, చెల్లెల్ని విడిపించలేదు. అందుకు ఎవరి సహాయమైనా కావాలి. ఇప్పుడు ఎవరో మనిషి చెట్టెక్కినట్టు గ్రహించి ఆ భూతం, "ఎవరయ్యా నువు?" అని అడిగింది.

తన లాగే మరో మనిషి చెట్టుమీద ఉన్నాడనుకుని రంగడు, "నా పేరు

రంగడు. చాలా తెలివైన వాణ్ణి.' అన్నాడు.

''ఆహా, తెలివైన వాడివైతే నాకొక చిన్న సహాయం చెయ్యి.'' అన్నది భూతం.

తనను ఒకరు సహాయం అడుగుతున్నందుకు రంగడు ఎంతో గర్వపడి, ''తప్పకుండా చేస్తాను. ఏం సహాయం కావాలో చెప్పు?'' అన్నాడు.

''చెట్టు దిగి, చెట్టు మొదట్లో తవ్వి, నేలలో పాతి ఉన్న సీసా తియ్యి.'' అన్నది భూతం.

రంగడు చెట్టు దిగి, నేలను వేళ్ళతో కెలికి చూశాడు. నేల గట్టిగా ఉన్నది.

''తవ్వటానికి గునపం కావాలే!'' అన్నాడు వాడు.

''నీ తెలివి ఉపయోగించు,'' అన్నది భూతం.

రంగడు చుట్టూ చూశాడు. దూరాన ఎక్కడో వెలుగు కాస్త కనిపించింది. ''అక్కడెవరో మనుషు లున్నట్టున్నారు. గునపం పట్టుకొస్తాను,'' అంటూ రంగడు అటుకేసి వెళ్ళాడు.

అక్కడ నిజంగానే ఒక కోయవాళ్ళ గుడిసె ఉంది. అందులో కోయదంపతు లున్నారు. తన ఊహ నిజమైనందుకు రంగడు చాలా గర్వపడి, ''ఇప్పుడే తిరిగి



యిచ్చేస్తాను, ఒక గునపం ఇయ్యండి.'' అని కోయదంపతులను అడిగాడు.

వాళ్ళకు గునపం అంటే ఏమిటో తెలియలేదు.

''అసలు నువు ఎవరు? ఇక్కడి కెందుకు వచ్చావు?'' అని వాళ్ళు రంగణ్ణి అడిగారు.

''నేను చాలా తెలివి గల వాణ్ణి. త్వరగా నాకు గునపం ఇచ్చెయ్యండి.'' అన్నాడు రంగడు.

తమ వెంట రమ్మని వాళ్ళు రంగణ్ణి ఆ సమీపంలోనే ఉన్న ఒక మునీశ్వరుడి దగ్గిరికి తీసుకుపోయారు. మునీశ్వరుడు రంగణ్ణి చూస్తూనే వాడి సంగతంతా



గ్రహించి, "నువు వట్టి అమాయకుడివి నాయనా. నువు బాగుపడేందుకు ఒక వరం కోరుకో, ఇస్తాను," అన్నాడు.

"నాకు వరం అక్కర్లేదు. గునపం కావాలి," అన్నాడు రంగడు.

"గునపం కూడా ఇస్తాను," అంటూ మునీశ్వరుడు వాడికి ఒక గునపం ఇచ్చాడు.

రంగడు విజయగర్వంతో చెట్టు దగ్గిరికి తిరిగి వచ్చి, చెట్టు మొదట్లో తవ్వి, ఒక సీసా పైకి తీశాడు.

చెట్టు మీద ఉన్న భూతం, రంగడు చేసినపనికి సంతోషించి, "భేష్! ఆ సీసాను పగలగొట్టు," అన్నది.

"ఇంత కష్టపడి సీసా తీసింది పగలగొట్టటానికా? నేనేం తెలివి తక్కువ వాడి ననుకున్నావా?" అన్నాడు రంగడు.

"అందులో బంగారం ఉంది. సగం నీకిస్తాను," అన్నది భూతం.

తన తెలివి తేటలతో బంగారం సంపాదిస్తున్నందుకు రంగడు గర్వపడి, సీసాను నేలకేసి గట్టిగా కొట్టాడు. పెద్ద చప్పుడుతో సీసాలోనుంచి భూతం బయటికి వచ్చింది.

"ఎక్కడ నా బంగారం?" అంటూ అరిచాడు రంగడు. వాడు భూతాన్ని చూడలేదు. చెట్టు మీది భూతం వాడి ముందు కొన్ని బంగారు నాణాలు విసిరింది. రంగడు వాటిని ఏరుకుని, తన ప్రయోజకత్వం తల్లికి రుజువు చేద్దామని, చీకట్లోనే పడి ఇంటి దారి పట్టాడు.

మధ్య దారిలో వాన వచ్చింది. వానలో ఇంకా ఎంతో దూరం నడవటం వాడికి చిరాకు అనిపించింది. మునీశ్వరుడి వరం జ్ఞాపకం వచ్చి, "నేనుండే దేశంలో వానలు ఉండరాదు," అని కోరుకున్నాడు.

వెంటనే వర్షం ఆగిపోయింది. రంగడు తన తెలివి తేటలకు అమితంగా సంతోషపడి, ఇంటికి పోయి, తల్లికి బంగారం ఇచ్చి, తాను సాధించిన ఘనకార్యాలన్నీ తల్లికి గర్వంగా చెప్పాడు. మునీశ్వరుడు ఇచ్చిన వరంతో వాడు వాన ఆపాడని

తెలియగానే వాడి తల్లి అదిరిపడింది. ఈ సంగతి తెలిస్తే పదిమందీ కలిసి వాణ్ణి చంపేస్తారు. అయినా వాడు వెర్రి బాగులవాడు గనక వాడు చెప్పినది నిజం కాకపోవచ్చునని ఆమె తనను తాను సమాధాన పరచుకున్నది.

కాని అదిమొదలు ఆ దేశంలో వానలు లేవు. తీవ్రమైన కాటకం ఏర్పడింది. అయితే దేశం సంపన్నమైనది కావటం చేత, రాజు ఇతర దేశాల నుంచి ఆహార ధాన్యాలు కొని ఆ సంవత్సరం గడిపేశాడు. కాని మరుసటి ఏడు కూడా దేశంలో వర్షం లేదు. విచిత్రమేమిటంటే చుట్టు పక్కల దేశాలలో భారీగా వర్షాలు కురుస్తూనే ఉన్నాయి.

రంగడి తల్లికి ఇప్పుడు రంగడి వరంలో నమ్మకం కుదిరింది. ఆమె తన కొడుకుతో, అరణ్యంలో మునీశ్వరుడు ఉండే చోటికి పోయింది. అయితే ఆ మునీశ్వరుడు అక్కడ లేడు. ఆయన ఎక్కడికి వెళ్ళాడో కోయవాళ్ళకు కూడా తెలియదు.

రంగడి తల్లి రాజును చూడబోయి "మహారాజా, నా కొడుక్కు అభయం ఇచ్చేటట్టుంటే వానలు కురవక పోవటానికి కారణం చెబుతాను. దేశాన్ని కాపాడే మార్గం మీరే చూడండి," అన్నది.

"నీ కొడుక్కు అభయం ఇస్తున్నాను, చెప్పు," అన్నాడు రాజు.

ఆమె జరిగినదంతా చెప్పి, "ఎందుకూ పనికిరాని నా కొడుకు దేశానికి కూడా



పనికి రాకుండా పోయాడు,'' అని కళ్ళ నీళ్ళు తుడుచుకున్నది.

రాజుకు మతిపోయింది. ఆయన తన మంత్రితో, ''ఆడినమాట నిలబెట్టుకుని అపఖ్యాతి రాకుండా చూసుకోనా, లేక ఈ పనికిరాని కుర్రవాణ్ణి చంపి, ప్రజల ప్రాణాలు కాపాడనా?'' అన్నాడు.

మంత్రి ఒక్క క్షణం ఆలోచించి, "రంగడు పనికిరానివాడు ఎలా అవుతాడు, ప్రభూ? వాడు ప్రాణాలతో ఉంటే మీరు చక్రవర్తి కావచ్చు,'' అన్నాడు.

''అది ఎలా?'' అన్నాడు రాజు.

''రంగడు తాను ఉండే దేశంలో వానలు పడకుండా వరం కోరుకున్నాడు. వాడు ఏ దేశంలో ఉంటే ఆ దేశంలో వానలు పడవు. వీణ్ణి రెండేళ్ళపాటు ఏ దేశంలో ఉంచితే ఆ దేశం ఆర్థికంగా దెబ్బతిని, మనకు సులభంగా వశమవుతుంది,'' అన్నాడు మంత్రి.

మంత్రి ఆలోచన బ్రహ్మాండంగా పారింది. కొద్ది సంవత్సరాల కాలంలో చుట్టు పక్కల ఉన్న దేశాలన్నీ రాజుకు లొంగి పోయాయి. ఆయన ఆ అన్ని దేశాల మీదా చక్రవర్తి అయాడు.

ఇప్పుడు రంగణ్ణి ఏం చెయ్యాలన్న సమస్య వచ్చింది. రాజువే అన్ని దేశాలూనూ. ఈ సామ్రాజ్యంలో రంగడు ఎక్కడ ఉన్నా అంతటా కాటకం వస్తుంది.

చక్రవర్తికి మంత్రి మరొక అమోఘమైన ఆలోచన చెప్పాడు. దాని ప్రకారం రాజు ఒక చిన్న గ్రామాన్ని స్వతంత్ర రాజ్యంగా ప్రకటించి, దానికి రంగణ్ణి రాజుగా అభిషేకించాడు. రంగడి రాజ్యంలో వానలు పడవు, పంటలు పండవు. కాని చక్రవర్తి నుంచి రంగడి రాజ్యానికి ఎంత కావాలంటే అంత ధన సహాయం లభిస్తూ ఉంటుంది. సోమరి పోతులకూ, విలాస జీవితాలు గడప దలచిన వారికీ అది అద్భుతమైన దేశం. ఒక ముని ఒక అపాత్రుడికి ఇచ్చిన వరం ఆ రాజ్యం రూపంలో వెలిసింది!





# దుష్టులకు దూరం

జనార్దనం తండ్రి వ్యాపారరీత్యా ఒక పెద్ద పట్నంలో ఉండేవాడు. ఆయన జనార్దనానికి బోలెడు డబ్బు కూడబెట్టి ఈయడమే కాక, పోయేటప్పుడు, "నాయనా, జనార్దనం, నేను పోయాక నువ్వీ పట్నంలో ఉండవద్దు. ఏదైనా మంచి చోటు చూసుకుని స్థిరపడు. నేను సంపాదించినది, నువ్వూ, నీ పిల్లలూ పది కాలాల పాటు కష్టపడకుండా తినగలిగినంతవుంది." అని చెప్పి కన్నుమూశాడు.

తండ్రి పోయాక జనార్దనానికి ఒక సమస్య పట్టుకుంది. ఎక్కడ స్థిరపడాలన్నది వాడికి తోచలేదు. స్వంత ఊరిలో వాణ్ణి ఆప్యాయంగా ఆదరించే వారు చాలా మంది ఉన్నారు. అయితే ఆ ఊరు అట్టే మంచిది కాదు. నీటి సౌకర్యం సరిగా ఉండదు. ప్రకృతి దృశ్యాలు ఉండవు. అంతా రాతి ప్రదేశం!

జనార్దనం ఆస్తిని కొంత బంగారంగానూ, కొంత నగదుగానూ మార్చుకుని, మంచి చోటు వెతుక్కుంటూ బయలుదేరాడు. పక్షం రోజుల తరువాత వాడికొక చక్కని ప్రదేశం నచ్చింది. సముద్రపు ఒడ్డున చిన్న పల్లెటూరు! సరుగుడు తోటలు. ఇసక దిబ్బలు. ఆ చల్లని ప్రశాంత వాతావరణం జనార్దనాన్ని ఎంతగానో ఆకర్షించింది. వాడు సరుగుడు తోటలో చిన్న పాక వేసుకుని, అక్కడే స్థిరపడ్డాడు. రోజూ సాయంత్రం వాడొక చిన్న నాటు పడవలో సముద్ర విహారానికి వెళ్ళేవాడు.

ఆ పల్లెటూళ్ళో ప్రజలందరి ముఖ్య వృత్తి చేపలు పట్టటం. వాళ్ళకు ఏమీ కష్టపడకుండా తిని కూర్చునే, యీ కొత్తగా వచ్చిన మనిషిని చూస్తే అసూయగా ఉండేది.

ఎం. కామేశ్వరరావు



ఒక రోజు ఎండవేళ జనార్ధనం, ఇంటి ముందున్న సరుగుడుచెట్టు కింద మంచం వేసుకుని పడుకున్నాడు. అవతల ఎండ నిప్పులు చెరుగుతున్నా, ఆ సరుగుడు తోటలో చల్లగా గాలి వీస్తోంది.

ఎవరో పిలిచినట్లయి, జనార్ధనానికి మెలుకువ వచ్చింది.

మంచం దగ్గిర ఒక మనిషి నిలబడి ఉన్నాడు. పొడువాటి రాగి రంగు గడ్డమూ, నున్నని గుండూ—వాడు ఎర్ర రంగు పొడుగు చేతుల అంగీ, నల్లని పంచె ధరించి ఉన్నాడు. వాడి మెడలో కాకిఈకల దండ ఉంది. వాడి కళ్ళు ఎర్రగా ఉన్నాయి. వాడు, "కుర్రాడా, చెంబెడు మంచి నీళ్ళు పట్రా! దాహంగా వుంది. ఎండలు మాడ్చేస్తున్నాయి." అన్నాడు జనార్ధనంతో.

జనార్ధనం మంచి నీళ్ళు తేవటానికి లోపలికి వెళ్ళబోయాడు.

"ఆగు, కుర్రాడా! చిక్కటి మజ్జిగలో చిటికెడు ఉప్పేసి పట్టుకురా! నా నోరు పిడచగట్టుకు పోయింది," అన్నాడా మనిషి.

జనార్ధనం, "అలాగే," అని వెళ్ళ బోయాడు.

"దాంట్లో ఒక నిమ్మకాయ కూడా పిండు, రుచిగా ఉటుంది," అని కేక పెట్టాడా గడ్డపుమనిషి.

జనార్ధనం ఆ మనిషి అడిగినట్లు గానే ఒక గిన్నెలో ఉప్పు, నిమ్మకాయరసమూ వేసిన మజ్జిగ పట్టుకొచ్చాడు.

ఆ పాటికి, ఆ మనిషి, జనార్ధనం వేసుకున్న మంచం మీద కూర్చుని తాపీగా కూనిరాగాలు తీసుకుంటున్నాడు. వాడు గుటగుట మజ్జిగ తాగేసి, "గిన్నె నికేపంలా ఉంది. ఎవరయినా కాజేయగలరు, లోపల దాచిరా!" అన్నాడు.

జనార్ధనం గిన్నె లోపల పెట్టి వచ్చేసరికి, ఆ మనిషి మంచం మీద అడ్డంగా పడుకుని ఉన్నాడు. "మంచి ఎండ వేళ కదూ, నిద్ర ముంచుకు వస్తోంది.

ఒక కునుకు తీసి లేస్తాను," అని క్షణంలో ఆ మనిషి గుర్రు పెట్టసాగాడు.

జనార్ధనం ఏమీ అనలేక పోయాడు. వాడు ఇంటి అరుగు మీద కూర్చుని, సాయంత్రం దాకా కాలక్షేపం చేశాడు. చీకటి పడ్డాక ఆ మనిషి లేచి ఆవులిస్తూ, "అప్పుడే చీకటి పడిపోయింది. ఒంటరి జీవితమై పోయింది. ఇంట్లో దీపం వెలిగించే దిక్కు కూడా లేదు," అంటూ తిన్నగా పాకలో కెళ్ళి, గూట్లో దీపం వెలిగించాడు.

వాడి అతి చనువుకు జనార్ధనానికి చిరాకు వేసింది. "బాగా చీకటి పడి పోయింది. ఇక నువ్వు వెళ్ళవచ్చు," అని కోపాన్ని దిగమింగుతూ అన్నాడు.

ఆ మనిషి జనార్ధనాన్ని ఎగాదిగా చూసి, "ఎవడివయ్యా, నువ్వు? నా ఇంటికి వచ్చి నన్నే దబాయిస్తావా? వెళ్ళు, వెళ్ళు. మర్యాద ఇచ్చి పుచ్చుకోవాలి తెల్సిందా?" అంటూ జనార్ధనాన్ని అవతలకు నెట్టి, తలుపు మూసుకున్నాడు.

ఆ రాత్రంతా జనార్ధనం, తలుపు బాదుతూ అవతలే ఉన్నాడు. ఆ మనిషి, "నా ఇంటి తలుపులు బద్దలవుతే నువ్వే డబ్బు లిచ్చుకోవాలి," అనేసి నిద్ర పోయాడు. కొంతసేపటికి తెల్ల వారింది. ఊరి వాళ్ళు చేపల వేటకి బయలు



దేరారు. జనార్ధనం వాళ్ళందరినీ పిలిచి, "ఈ అన్యాయం చూడండి," అంటూ జరిగిందంతా చెప్పాడు.

ఇంతలో ఆ మనిషి తలుపు తీసుకుని వచ్చి, "వీడెవడో పిచ్చివాడిలా ఉన్నాడు. నా ఇంటిని పట్టుకుని తన ఇల్లంటూ రాత్రంతా ఒకటే రచ్చ!" అన్నాడు.

జనార్ధనానికి ఆవేశం వచ్చి, "మీరే చెప్పండి. ఈ ఇల్లు నాదా, వాడిదా? మీరంతా రోజూ వస్తూ పోతూ నన్ను చూడటంలేదూ? ఈ దొంగపీనుగకి బుద్ధి చెప్పండి," అన్నాడు కోపంగా.

ఊరి వాళ్ళంతా జనార్ధనాన్ని కింద నుంచి పైదాకా తేరిపార చూసి, "ఎవ

డివి రా నువ్వు? చూస్తే దొంగవిలా ఉన్నావు. ఈ ఇల్లు ఈ గడ్డపాయనదే! మేం రోజూ ఇతన్నే చూస్తున్నాం. మేం ఇప్పటిదాకా నిన్ను చూసిన పాపాన పోలేదు. మర్యాదగా నీ దారిన నువ్వు పో. లేకపోతే ఎముకలు విరిగేలా తంతాం!'' అని జనార్ధనాన్ని దబాయించారు.

జనార్ధనం నిర్ఘాంత పోయాడు. ఊరి వారంతా తన మీద అసూయతో, తన ఆస్తి కాజేయాలనే దురుద్దేశంతో ఈ నాటకం ఆడుతున్నారని వాడు గ్రహించాడు. వాడు రెండు సారు గట్టిగా తల విదిలించి, వెర్రి చూపులు చూస్తూ, ''మీరు నా కళ్ళు తెరిపించారు. ఇన్నాళ్ళూ ఈ ఇల్లు నాదనుకున్నాను. అయితే నేను పెట్టెలో పెట్టి దాచిన బంగారం కూడా నాదికాదా?'' అని అమాయకంగా వాళ్ళని అడిగాడు.

వాళ్ళు జనార్ధనం మతి కోల్పోయాడని రూఢి పరుచుకుని, ''నీది కాదు. ఆ బంగారం అంతా మాది. అది ఎక్కడ దాచావో త్వరగా చెప్పు!'' అంటూ ఆత్రుతగా వాణ్ణి అడిగారు.

జనార్ధనం దూరంగావున్న ఎత్తైన ఇసక దిబ్బను చూపించి, ''పెట్టెడు బంగారం ఆ ఇసకదిబ్బలోనే ఉంది,'' అన్నాడు.

అంతా ఎవరికి వారే కాలిసత్తువ కొద్దీ ఆ వైపుకి పరిగెత్తారు. ఆ బంగారం ఎవరికి వారే తమ సొంతం చేసుకోవాలని ఆత్రం. గడ్డంమనిషితో సహా అందరూ ఆ వైపుకి పరిగెత్తి పోగానే, జనార్ధనం తేలిగ్గా నిట్టూర్చి, సరుగుడు చెట్టు మొదట్లో పాతి పెట్టిన బంగారం ఉన్న పెట్టెను తీసుకుని, అప్పటి కప్పుడు నాటు పడవలో బయలుదేరి ఆ దుష్టులకు దూరంగా వెళ్ళిపోయాడు.

మంచి చోటు అని తండ్రి అనటంలో అసలు అర్ధం మంచి మనుషులున్న చోటని జనార్ధనం తెలుసుకుని, తమ సొంత ఊరు వెళ్ళిపోయి, తనని ఆదరించే వారి మధ్య ఆనందప్రదం అయిన జీవితం గడిపాడు.





# పొరనిమోసం

ఒక గ్రామంలో నరసయ్య అనే సామాన్య స్థితిపరుడు ఉండే వాడు. అతనికి కొద్దిగా వ్యవసాయమూ, కొన్ని పశువులూ ఉండేవి.

ఒకనాడు ఊరి కరణం నరసయ్యతో, "అగ్రహారపు భూమి అయిదు ఎకరాలు అమ్ముతామని బ్రాహ్మణులు నాతో అన్నారు. వారు స్వదేశానికి తిరిగి పోతారుట. ఎకరా రెండు వందల వరహాలకు అమ్ముతున్నారు. చాలా చౌక!" అన్నాడు.

నరసయ్య ఆ పొలాన్ని కొనటానికి ఒప్పుకుని బ్రాహ్మణులకు డబ్బు చెల్లించి, కాగితాలు రాయించుకుని, పొలం స్వాధీనం చేసుకున్నాడు. బ్రాహ్మణులు డబ్బు తీసుకుని వెళ్ళిపోయారు.

ఒకనెల గడిచింది. ఆ గ్రామంలోనే సుబ్బయ్య అనే ఆశాపాతకుడు ఉన్నాడు. బ్రాహ్మణుల వద్ద నరసయ్య చౌకగా పొలం కొన్నాడని విని సుబ్బయ్య ఓర్చలేక, కరణం వద్దకు పోయి, "నీలాటి కరణాన్ని ఎక్కడా చూడలేదు. ఆ ఐదు ఎకరాల పొలాన్ని నాకు ఇప్పించి ఉంటే నీకు కొంత ముట్టజెప్పి ఉందును గద!" అన్నాడు.

డబ్బు మాట వినగానే కరణానికి దుర్బుద్ధి పుట్టింది. ఇద్దరూ కూడబలుక్కుని, నరసయ్యకు ఆ భూమి దక్కకుండా చేయాలనుకున్నారు.

ఒకరోజు నరసయ్య మనుషులు కొత్త పొలాన్ని దున్నటానికి పోయేసరికి, సుబ్బయ్య అడ్డపడి, "ఈ పొలం నాది," అని పేచీపెట్టి, వాళ్ళను పంపేశాడు.

మర్నాడు నరసయ్య సుబ్బయ్య వద్దకు వెళ్ళి, "ఏమిటి, సుబ్బయ్యా, నా పొలంలో ఏదో పేచీ పెట్టావట?" అని అడిగాడు.

ఇండ్ల వెంకటేశ్వరరావు



''అవును. నేను కొన్న పొలంలోకి నీ మనుషులు రావటమేమిటి? ఆ మాట నిన్ను అడగటానికి నేనే రావాలనుకుంటున్నాను,'' అన్నాడు సుబ్బయ్య.

ఆ మాట విని నరసయ్య ఆశ్చర్యపోయి, ''ఆ పొలాన్ని కరణంగారే నాకిప్పించారు, వెయ్యి వరహాలు పెట్టి కొన్నాను,'' అన్నాడు.

సుబ్బయ్య నరసయ్యను తీసుకుని కరణం వద్దకు వెళ్ళి, ''ఏమండీ, కరణంగారూ, నేను కొన్న పొలాన్ని మీరు ఈ నరసయ్యకు అమ్మారట. ఆ పొలాన్ని నేను అయిదేళ్ళ క్రితం కొన్నాను,'' అన్నాడు.

కరణం ఏదో కాగితాలు తిరగేసినట్టు నటించి సుబ్బయ్యతో, ''క్షమించండి! పొరపాటు జరిగింది. ఆ బ్రాహ్మణుల భూములకు పట్టాలులేవు గదా, అందుచేత అవి మీరు కొన్నట్టు తెలియదు. ఆ బ్రాహ్మణుల వద్ద ఆ భూమిని మీరు కొన్నట్టు ఈ పాతలెక్కలలో ఉన్నది. కొత్త కరణాన్ని గదా అని వాళ్ళు నన్ను మోసం చేశారు. నేను మధ్య చిక్కులో పడ్డాను,'' అన్నాడు.

''సరే, అయితే నా పైకం నాకు ఇప్పించండి. లేదా, పొలం దున్నుకోనివ్వండి. బ్రాహ్మణులు నాకు పొలం అమ్మినట్టు మీరే రాసి ఇచ్చారు గదా,'' అన్నాడు నరసయ్య కరణంతో.

''నా భూమిని నువు కొనటమే నేరం. దాన్ని ఎలా దున్నుకుంటావు? నీ పైకం ఆ బ్రాహ్మణుల నుంచి వసూలు చేసుకో. లేదా, న్యాయాధికారి దగ్గిర ఫిర్యాదు చేసుకో,'' అన్నాడు సుబ్బయ్య.

''సరే, న్యాయాధికారి దగ్గిరికే పోతాను,'' అని నరసయ్య వెళ్లిపోయాడు. అతనికి వారిద్దరూ మోసం చేస్తున్నట్టు తెలిసిపోయింది.

నరసయ్య వెళ్ళిపోయాక కరణం సుబ్బయ్యతో, ''రాజుగారి దివాణంలో నాకు తెలిసినవాడు ఒకడు ఉన్నాడు.

ఆ భూమిని నువే దున్నుతున్నట్టూ, శిస్తు వగైరాలు నువే చెల్లిస్తున్నట్టూ లెక్కలు రాసి, వాడి చేతికి ఇచ్చి వస్తాను. వాడు భూమి తాలూకు లెక్కల'లో వాటిని ఇరికిస్తాడు. అప్పుడు భూమి నీకు ఖాయం అవుతుంది,'' అన్నాడు.

ఆ మర్నాడే వాళ్ళిద్దరూ బయలుదేరి నగరానికి వెళ్ళి, రాజుగారి ఉద్యోగిని కలుసుకుని మాట్లాడి, వాడికి వంద వరహాలు లంచంపెట్టి, ''ఈ పని పూర్తి అయే టట్టు చూడు,'' అన్నారు.

వాడు దొంగ లెక్కల కాగితాలు తీసుకుని, ''ఇది చాలా ప్రమాదమైన పని. పని పూర్తి అయితే మరో యాభై వరహాలు ఇయ్యండి,'' అన్నాడు.

సుబ్బయ్య సరే నన్నాడు. తమ ఎత్తు పారినందుకు మురిసిపోతూ కరణమూ, సుబ్బయ్యా తిరిగివచ్చారు.

మర్నాడు నరసయ్యా, కరణమూ, సుబ్బయ్యా న్యాయాధికారి వద్దకు వెళ్ళి, ఎవరు చెప్పవలసినది వారు చెప్పారు.

''నరసయ్యా, నువు పొలం కొన్నట్టు రుజువు ఉన్నదా? '' అని న్యాయాధికారి అడిగాడు.

''ఈ కరణంగారే, నా చేత బ్రాహ్మణులకు డబ్బుఇప్పించి, పొలం నేనుకొన్నట్టు రాసియిచ్చారు,'' అన్నాడు నరసయ్య.



న్యాయాధికారి సుబ్బయ్యను, ''ఆ పొలాన్ని లోగడ నువు కొన్నట్టు కాగితాలు ఏవి?'' అని అడిగాడు.

సుబ్బయ్య ఆయనకు దొంగ రసీదులు చూపి, "నేను పొలాన్ని సాగుబడి చేస్తున్నట్టు రసీదులు ఇవిగోనండి," అన్నాడు.

న్యాయాధికారి వాళ్ళతో, ''రెండు రోజులు ఆగి రండి. ఈ భూముల తాలూకు పత్రాలన్నీ రాజుగారి దివాణంలో ఉంటాయి. వాటి వివరాలు తెప్పిస్తాను," అని, వాళ్ళను పంపేశాడు.

న్యాయస్థానం నుంచి తిరిగి వస్తూ సుబ్బయ్య కరణంతో, ''ఈ దెబ్బతో నరసయ్యకు వెయ్యి వరహాలూ, పొలమూ

కూడా పోయాయి. నీ బుర్ర గట్టిదయ్యా!" అని మెచ్చుకున్నాడు.

''న్యాయాధికారి పంపే ఫిర్యాదు మన వాడికే చేరుతుంది. వాడు మనకు అను కూలంగానే రాసి న్యాయాధికారికి పంపు తాడు,'' అన్నాడు కరణం.

మూడో రోజు రాజుగారి దివాణం నుంచి ఇద్దరు మనుషులు వచ్చి న్యాయాధికారికి ఏవో కాగితాలు అందజేశారు. వాటిని చూసుకుని న్యాయాధికారి కరణాన్నీ, సుబ్బయ్యనూ, నరసయ్యనూ పిలిపించి, " మీ ఫిర్యాదుకు దివాణం నుంచి సమా ధానం వచ్చింది,'' అన్నాడు.

ఆ మాట విని సుబ్బయ్యా, కరణమూ ఒకరి నొకరు చూసుకుని నిబ్బరంగా ఉండి పోయారు. నరసయ్య తనకు న్యాయం జరుగుతుందనే పూర్తి నమ్మ కంతో ఉన్నాడు.

న్యాయాధికారి ఇలా అన్నాడు :

''ఆ అయిదు ఎకరాల భూమి నర సయ్యదే. ఆ భూమిని రాజుగారి తండ్రి గారు నరసయ్య తాతగారికి ఉచితంగా ఇచ్చారు. నరసయ్యగారి తండ్రిగారు దాన్ని పేద బ్రాహ్మణులకు దానం ఇచ్చాడు. అదే భూమిని నరసయ్య డబ్బు పోసి కొనుక్కున్నాడు. అతనివల్ల తప్పేమీ లేదు. పోతే, నరసయ్యకు నష్టపరిహారం కింద కరణమూ, సుబ్బయ్యా కలిసి వెయ్యి వరహాలు చెల్లించాలి.''

ఇద్దరూ ఒక్కసారిగా, ''ఎందుకూ?'' అన్నారు.

''మీ రిద్దరూ కలిసి దొంగ రసీదులు పుట్టించటమే గాక, రాజుగారి ఉద్యోగికి లంచం ఇచ్చి అతని చేత అవినీతిగా ప్రవర్తింప జేశారు. అందుకు రాజుగారు మీకు ఈ శిక్ష నిర్ణయించారు,'' అన్నాడు న్యాయాధికారి.

కరణమూ, సుబ్బయ్యా కలిసి నరసయ్యకు వెయ్యి వరహాలు ఇచ్చు కున్నారు. గూఢచారులు దివాణంలోని ఉద్యోగిని పట్టుకున్నారని వారికి తరవాత తెలియవచ్చింది.





# వీర హనుమాన్

ఇంద్రుడు అంత ఉన్నాడు గదా అన్న ధైర్యంతో రాహువు ఆంజనేయుడి మీదికి వెళ్ళాడు. ఆంజనేయుడు రాహువును ఎగాదిగా చూసి, పండు అనుకుని పట్టుకోబోయాడు. ఆంజనేయుడు ఆర్భాటం చేసి ఉగ్రనరసింహమూర్తి లాగా మీదికి రావటం చూసి రాహువు కంగారుగా ఇంద్రుడి దగ్గిరికి పరిగెత్తుకుంటూ పోయి, "ఈ అబ్బాయి నన్ను చంపేస్తున్నాడు. రక్షించు!" అని కేకలు పెట్టాడు.

"భయపడకు," అంటూ ఇంద్రుడు తన ఏనుగును ముందుకు తోలాడు.

ఘీంకరిస్తూ తన మీదికి వచ్చే ఐరావతాన్ని చూసి ఆంజనేయుడు, "ఈ పండు తెల్లగా బాగుంది. దీన్ని తిని ఆకలి తీర్చుకుంటాను," అనుకుని, మీదికి వచ్చే సరికి, ఐరావతం కూడా బెదిరింది.

ఇంద్రుడికి కోపం వచ్చి, ఆంజనేయుడి పైన వజ్రాయుధం విసిరాడు. ఆ దెబ్బకు ఆంజనేయుడి దవడ విరిగి పోయింది. అతను ఉదయాద్రి మీద పడిపోయి, కదలకుండా ఉండిపోయాడు.

ఇది చూసి వాయుదేవుడికి దుఃఖం ముంచుకు వచ్చింది. అతనికి కోపం కూడా వచ్చి, సంచరించటం మానేశాడు.

ఈ లోపల అంజన పర్ణశాలకు తిరిగి వచ్చి చూసేసరికి, పక్క మీద బిడ్డ లేదు. ఆమె తన బిడ్డ కోసం రకరకాలుగా ఏడవటం మొదలు పెట్టింది.

## 2. సుగ్రీవుడి వద్ద మంత్రిత్వం



కేసరి ఆమెను ఊరడిస్తూ, ''ఏడవకు. నీ కొడుకు ఉదయించే సూర్యుణ్ణి చూసి పండు అని భ్రమపడి పట్టుకోబోయాడు. ఈ సంగతి రాహువు చెప్పేసరికి ఇంద్రుడు వచ్చి, దవడ పగిలేటట్టు కొట్టాడు. నీ కొడుకు స్పృహ తప్పి, తూర్పు కొండ మీద పడి ఉన్నాడు. వాయుదేవుడు ఇంద్రుడి పైన అలిగి, సంచారం మానేశాడు. నీ కొడుక్కు సమస్త శుభాలు కలుగుతాయి,'' అన్నాడు.

ఈ మాటలతో అంజన ఊరడిల్లింది.

వాయుదేవుడు అలిగి స్తంభించి పోయేసరికి దేవతలు కంగారుపడి, బ్రహ్మ వద్దకు వెళ్ళి, ఇంద్రుడు ఆంజనేయుడి దవడ పగలగొట్టి మూర్ఛ పోగొట్టిన సంగతీ, వాయుదేవుడు అలిగిన సంగతీ చెప్పి, కాపాడమని వేడుకున్నారు.

బ్రహ్మదేవుడు హంస వాహనం మీద వాయుదేవుడు ఉన్న చోటికి వెళ్ళి, ''నాయనా, సమస్త ప్రాణులకూ ప్రాణమిచ్చే వాడివి, అంతటా ఉండే వాడివి! నువు అలగటం ధర్మమా?'' అన్నాడు.

వాయుదేవుడు వెళ్ళి, మూర్ఛపోయి ఉన్న ఆంజనేయుణ్ణి తన చేతుల్లో ఎత్తి తీసుకు వచ్చి, బ్రహ్మ కాళ్ళవద్ద పెట్టి నమస్కారం చేశాడు. బ్రహ్మ ఆ కుర్రవాణ్ణి తన చేత్తో తాకే సరికి, అతనిలో తిరిగి చైతన్యం వచ్చింది.

ఇది చూసి వాయుదేవుడు సంతోషించి, లోక సంచారం చెయ్యటానికి బయలుదేరి పోయాడు. బ్రహ్మ దేవతలతో, ''ఈ కుర్రవాడు లోకాలన్నిటినీ సంతోషపెట్టగలవాడు. ఇతనికి వరాలు ఇద్దాం. ఇతను సాక్షాత్తూ శివుడి అవతారం,'' అన్నాడు.

అప్పుడు ఆంజనేయుడికి భూదేవి వేదశాస్త్రాలు వచ్చేటట్టుగా శక్తినిచ్చింది; నీటి భయం లేకుండా వరుణుడు వరమిచ్చాడు; మృత్యు భయమూ, ముసలితనమూ లేకుండా యముడు వరమిచ్చాడు; కుబేరుడు యుద్ధాలలో విజయం ఇచ్చాడు; విశ్వకర్మ కనక



కుండలా లిచ్చాడు. ఇంద్రుడు ఆంజనే యుడికి హనుమంతుడు అనే పేరుపెట్టి, వజ్రాయుధం చేత అతనికి హాని లేకుండా వర మిచ్చాడు. (హనుమ అంటే దవడ.) బ్రహ్మ హనుమంతుడికి దీర్ఘాయువూ, చిరంజీవిత్వమూ ఇచ్చాడు.

తరవాత బ్రహ్మ వాయుదేవుడితో, "నీ కొడుకు నిష్కల్మషమైన కీర్తి సంపాదిస్తాడు. ఎన్నడూ ఓడడు. ఏక వీరుడు. పర్వతంలాటి ధీరత్వం గలవాడు. అణిమాది సిద్ధులన్నీ ఇతనికి ఉంటాయి. తలుచుకున్న మాత్రాన విశ్వమంతా చూడగలడు. విరాగి, ఎలాటి కామమూ లేనివాడు. కామరూపి. ఇతనిలో అంతు లేని శౌర్య, ధైర్య, దయాది గుణాలుంటాయి. ఎన్నో అద్భుతమైన పనులు చేస్తాడు. వాటిని నువే చూస్తావు," అని చెప్పి వెళ్ళిపోయాడు. హనుమంతుణ్ణి గురించీ, అతను సూర్యుణ్ణి పట్టుకోబోవటం గురించీ చిత్రంగా చెప్పుకుంటూ దేవతలు కూడా వెళ్ళిపోయారు.

వాయుదేవుడు హనుమంతుణ్ణి తీసుకుపోయి అంజన కిచ్చాడు. ఆమె తన కొడుకును తిరిగి సంపాదించి ఆనంద బాష్పాలు రాల్చింది. ఆ ప్రాంతాల తపస్సు చేసుకునే వాళ్ళు హనుమంతుడి సంగతివిని ఆశ్చర్యపడుతూ, "సూర్యుడి కాంతి మీదపడితేనే తాపం కలుగుతుంది గదా. ఈ పిల్లవాడు వెళ్ళి సూర్యుణ్ణి పట్టుకోవట మేమిటి?" అనుకున్నారు.

తన కొడుక్కు దేవతలందరూ వరాలిచ్చిన సంగతి తెలిసి కేసరి చాలా సంతోషించాడు.

హనుమంతుడు పెరిగివస్తూ, సమస్తమైన జ్ఞానమూ కలిగి ఉండి కూడా ఆకతాయి పనులు చేస్తూ తిరగసాగాడు. మంచి పనులు చెయ్యాలిగాని, మర్కట చేష్టలు చెయ్యరాదనీ, దరిద్రులను బాధించటం చాలా అసహ్యమనీ తల్లి దండ్రులు ఎంత చెప్పినా వినక, అతను కోతివేషాలు వేస్తూ కాలం గడిపే వాడు.



కొంతకాలం గడిచింది. ఒకనాడు అంజన హనుమంతుడితో, "నాయనా, కిష్కింధలో వాలి, సుగ్రీవులని ఇద్దరు అన్నదమ్ములున్నారు. మా తల్లి అయిన అహల్య రహస్యంగా వాళ్ళను ఇంద్రుడికీ, సూర్యుడికీ కన్నది. ఆ సంగతి తెలిసి మా తండ్రి గౌతముడు వారిని వానరులు కమ్మని శపించాడు. అందుచేత వాళ్ళు నీకు మేనమామలు. నువు కిష్కింధకు వెళ్ళి, సుగ్రీవుడి అండ చేరు. ఏ కారణం చేతనైనా వాలి సుగ్రీవుల మధ్య వైరం వస్తే నువు వాలిని చంపేవు సుమా!" అన్నది.

లోకాలను రక్షించటానికి పుట్టిన ఈ హనుమంతుడు చిన్నతనంలోనే ఇంత ఆకతాయి పనులు చెయ్యట మేమిటో బ్రాహ్మణులకు అర్థం కాలేదు. ఏదన్నా శాపం పెడదామన్నా, అతనికి శాపాలు తగలకుండా బ్రహ్మ ఇచ్చిన వరం ఉన్నది! అంతే గాక, ఇంత మహాశక్తి మంతుడికి ఏ అడ్డూ, అదుపూ లేక పోతే లోకాలను తారుమారు చేయడా? అందు చేత ఆ బ్రాహ్మణులు హనుమంతుడికి తన బలం తెలియకుండా ఉండాలన్నారు.

వెంటనే హనుమంతుడు సాత్వికుడుగా మారిపోయాడు. కొడుకులో ఈ మార్పు చూసి, అంజనా, కేసరీ తృప్తి పడ్డారు.

హనుమంతుడు తల్లికి నమస్కరించి, సెలవు తీసుకుని, కిష్కింధకు వెళ్ళాడు. వాలి సుగ్రీవులు అతన్ని ఆదరించారు. అతను సుగ్రీవుడికి మంత్రిగా ఉండనారంభించాడు. అతనికి వేదాలూ, శాస్త్రాలూ నేర్చుకోవాలని కోరిక కలిగింది.

ఒకనాటి ఉదయం హనుమంతుడు కాలకృత్యాలు తీర్చుకుని, సూర్యుడు ఉదయించే సమయానికి గగన మార్గాన ఎగిరి సూర్యుడి వద్దకు వెళ్ళి, నమస్కారం చేశాడు.

సూర్యుడు సంతోషించి, "సంకల్ప సిద్ధిరస్తు! ఏం, నాయనా, ఏం పని మీద వచ్చావు?" అని అడిగాడు.

''అయ్యా, వేదశాస్త్రాలు నేర్చుకోవటానికి వచ్చాను,'' అన్నాడు హనుమంతుడు.

''బాగానే ఉంది. కాని నేను మేరు పర్వతం చుట్టూ అతివేగంగా తిరుగుతూ ఉంటాను. నా నుంచి శాస్త్రం నేర్చుకోవటం చాలా కష్టం అవుతుందే!'' అన్నాడు సూర్యుడు.

దానికి హనుమంతుడు, ''మహాత్మా, ఉదయపర్వతం మీద ఒక కాలూ, అస్తమయ పర్వతం మీద ఒక కాలూ పెట్టి మీ వద్ద చదువుకోమన్నారా, లేక మీకు ముందు నడుస్తూ చదువుకోమన్నారా?'' అని సూర్యుణ్ణి అడిగాడు.

సూర్యుడు ఈ మాటకు సంతోషించి, ''నాయనా, నీ వంటి వాడు సృష్టిలో మరెవడూ లేడు. రెండు కొండల మీదా పాదాలుంచి నిలబడు; దేవతలు చూసి ఆనందిస్తారు,'' అన్నాడు.

వెంటనే హనుమంతుడు సూర్యుడికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, తన శరీరాన్ని నక్షత్రాల కన్న పైగా ఉండేటట్టు పెంచి, అన్ని దిక్కులూ ఆక్రమించి, బ్రహ్మండం నిండేటట్టు చేశాడు. ఆ అవతారం చూసి బ్రహ్మదేవుడే నివ్వెరపోయాడు. మునులూ, దేవతలూ హనుమంతుణ్ణి చూసి నమస్కారాలు చేశారు.



సూర్యుడు పొందిన అద్భుతం అంతా ఇంతా కాదు. ఆయన హనుమంతుడితో, ''ప్రత్యక్ష రుద్రావతారుడివి! నాకు కీర్తి కలిగించటానికి వచ్చావే గాని, నేను నీకు ఏం ఉపదేశించగలను?'' అన్నాడు.

హనుమంతుడు వినయంగా, ''మహాత్మా, మీరు ఇలా అనవచ్చునా? వేదాలకు మూలమైనవాడివి. నన్ను శిష్యుడుగా చేసుకుని దయతో వేదత్రయం బోధించు.'' అంటూ తన మామూలు రూపం ధరించి, సూర్యుడి రథానికి ఎదురుగా నిలబడ్డాడు.

సూర్యుడు గడియకు తొమ్మిది లక్షల డెబ్భైవేల యోజనాల వేగంతో నడుస్తాడు. అంత వేగంతోనూ హనుమంతుడు



ఎగురుతూ, సూర్యుడికి ఎదురుగా నిలబడి, నేర్చుకోవలిసిన దంతా, స్మృతి పురాణాలతో కూడా నేర్చుకున్నాడు.

చదువు పూర్తికాగానే హనుమంతుడు సూర్యుడికి నమస్కారం చేసి, సెలవు పుచ్చుకుని, కిష్కింధ వెళ్లి, తన సంగతులన్నీ చెప్పాడు. సుగ్రీవుడు హనుమంతుడి పట్ల హెచ్చు ప్రేమ కలిగి, అతన్ని తన వద్దనే ఉంచుకున్నాడు.

వాలి సుగ్రీవులు చాలా అన్యోన్యంగా ఉండేవారు. వారిని పెంచిన తండ్రి ఋక్షవిరజుడు చనిపోయినాక వానరరాజ్యానికి వాలి రాజూ, సుగ్రీవుడు యువరాజూ అయారు.

వాలి బలపరాక్రమాలు సాటిలేనివి. అతనితో యుద్ధం చేసి ఎవరూ గెలవలేదు. రాజులందరినీ జయించిన మదంతో రావణుడు ఒకసారి వాలి వద్దకు వచ్చి, అతన్ని యుద్ధానికి పిలిచాడు. వాలి రావణాసురుడితో యుద్ధం చేసి, అతన్ని చావచితకగొట్టేశాడు. తరవాత రావణుడు వాలితో స్నేహంగా ఉంటూ వచ్చాడు.

తరవాత వాలిని యుద్ధానికి పిలిచినవాడు దుందుభి అనే రాక్షసుడు. వాడు మదించి హిమవంతుణ్ణి యుద్ధానికి పిలిచాడు. హిమవంతుడు దుందుభితో, "బాబూ, నీతో యుద్ధం చేసే శక్తి నాకు లేదు. నీతో యుద్ధం చెయ్యగలవాడు వాలి ఒక్కడే. నువు మధువనానికి వెళ్ళి, అతన్ని యుద్ధానికి పిలు, తప్పక వస్తాడు," అన్నాడు.

ఆ మాట విని దుందుభి మధువనానికి వచ్చి, ఆ వనాన్ని ధ్వంసం చేస్తూ, వాలిని యుద్ధానికి పిలిచాడు. మధువనం కిష్కింధకు బయట ఉన్నది. వాలి దుందుభి పిలుపు విని వచ్చి, యుద్ధంలో వాణ్ణి చంపి, వాడి శరీరాన్ని విసిరివేశాడు. దుందుభి కళేబరం దూరాన ఉన్న ఋశ్యమూక పర్వతం మీద పడింది. వాడి రక్తం, ఆ పర్వతం మీద తపస్సు చేసుకుంటున్న మతంగ

మహాముని మీద పడింది. ఆ ముని కోపించి, వాలి ఋశ్యమూకం మీదికి వస్తే అతని తల పగిలి పోతుందని శాపం పెట్టాడు.

తరవాత వాలికి దుందుభి కొడుకైన మాయావితో వైరం వచ్చింది. దుందుభిని వాలి చంపి ఉండటమేగాక, ఒక స్త్రీ విషయంలో కూడా మాయావికీ, వాలికీ వైరం ఏర్పడింది.

ఒకనాటి అర్ధరాత్రి మాయావి కిష్కింధ నగర ద్వారం వద్దకు వచ్చి, పెడబొబ్బలు పెట్టుతూ, వాలిని యుద్ధానికి పిలిచాడు. నిద్రపోతున్న వాలి లేచి, శత్రువు దర్పం సహించలేక, వాడితో యుద్ధానికి బయలు దేరాడు. సుగ్రీవుడూ, వాలి భార్య అయిన తారా వద్దని వారించబోయారు. కాని వాలి వినలేదు.

వాలిని ఆపలేక సుగ్రీవుడు కూడా అతని వెంట బయలుదేరాడు. అన్నదమ్ము లిద్దరూ వస్తూండటం చూసి మాయావి భయపడి, పారిపో సాగాడు. వాలి, సుగ్రీవులు అతన్ని తరుముకుంటూ వెళ్ళారు. మాయావి వారిని చాలా దూరం తీసుకుపోయి, ముళ్ళకంపలు కప్పి ఉన్న ఒక కొండ బిలంలో ప్రవేశించాడు.

"నేను మాయావిని హతమార్చి వచ్చిన దాకా నువు ఇక్కడే ఉండు," అని సుగ్రీవుడితో చెప్పి, వాలి కూడా బిలం ప్రవేశించాడు.

వాలి ఎంతకూ తిరిగి రాకపోయేసరికి, అతను చచ్చిపోయాడేమో నని సుగ్రీవుడికి భయం వేసింది. ఇంతలో బిలంలో నుంచి నురుగుతో కూడిన రక్తం బయటికి రాసాగింది. బిలంలో నుంచి వచ్చే ధ్వనులు రాకసుడివిగా అతనికి వినిపించాయి.

సుగ్రీవుడు తన అన్న కోసం దుఃఖించి, ఆ బిలానికి కొండరాయి అడ్డంపెట్టి, అన్నకు జలతర్పణాలు విడిచి, కిష్కింధకు తిరిగి వచ్చాడు. వానరులు అతన్ని రాజుగా అభిషేకించారు.





# అమరవాణి

రజతం వా, సువర్ణం వా
వస్త్రాణ్యాభరణాని చ,
అవిభక్తాని సాధూనా
మవగచ్ఛన్తి సాధవః.    1

[మిత్రులు ఒకరి వెండి, బంగారాలనూ, వస్త్రాలనూ, ఆభరణాలనూ ఒకరు భేదం చూడరు.]

ఆఢ్యో వాపి, దరిద్రో వా,
దుఃఖిత, స్సుఖితోపి వా,
నిర్దోషో వా, సదోషో వా,
వయస్యః పరమాగతిః.    2

[ధనవంతుడుగానీ, దరిద్రుడుగానీ, దుఃఖంలో ఉన్నవాడుగానీ, సుఖించే వాడుగానీ, దోషిగానీ, నిర్దోషిగానీ మిత్రుడే పరమగతి.]

ధనత్యాగ, స్సుఖత్యాగో,
దేహత్యాగోపి వా పునః,
వయస్యార్థే ప్రవర్తంతే
స్నేహం దృష్ట్వా తథావిధం.

[స్నేహాన్ని బట్టి ధనాన్నీ సుఖాన్నీ, చివరకు దేహాన్నీ కూడా త్యాగం చేస్తారు.]

స్నేహం—వాల్మీకి

Phota by J. Sarojini



బహుమతి
పొందిన వ్యాఖ్య

అసతోమా సద్గమయ

పంపినవారు :
వెంపరాల సుజాత

Photo by P. Sundaram



ఆచంట.
(పశ్చిమ గోదావరి జిల్లా)

తమసోమా జ్యోతిర్గమయ

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు నవంబర్ 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోష్టుకార్డు పైనమాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జనవరి నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
కుక్కలతో పిల్లాడు

మూడవ అట్ట:
సైకిల్ మీద పిల్ల

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd.,

